# బి. నందంగారి ఆసుపత్రి




తురగా జానకీరాణి

# బి. నందంగారి ఆసుపత్రి

పిల్లల వినోద నాటికలు

తురగా జానకీరాణి



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్

**B. NANDAM GAARI AASUPATRI**- Children's playlets

By :**TURAGA JANAKIRANI**

Published by: Director & Special officer, A.P. Baalala Akademi,

O/o Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad-500004

ప్రచురణ సంఖ్య: 81

మొదటి ముద్రణ: 1992

ప్రతులు: 5000

వెల: రు. 8.00

ముఖచిత్రం:

బొమ్మలు: కరుణాకర్

టైప్ సెట్టింగ్:

ప్రసాద్ గ్రాఫిక్స్

3-6-115/5, హైదర్‌గూడ రోడ్డు,

హిమాయత్ నగర్, హైదరాబాద్-500 029.

ముద్రణ:

కళాజ్యోతి ప్రోసెస్ ప్రైవేట్ లిమిటెడ్

ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్, హైదరాబాద్.

ప్రతులకు

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

జవహర్ బాలభవన్

పబ్లిక్‌గార్డెన్స్, హైదరాబాదు-500004

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976లో ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి (శ్రీ) మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషిచేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవిరెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

శారదాఅశోకవర్ధన్
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్‌బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి.

ఇందులో


1. బి. నందంగారి ఆసుపత్రి
2. మంచినీళ్ళప్రాయం
3. కనిపించుటలేదు
4. కనువిప్పు

# బి. నందంగారి ఆసుపత్రి

పిల్లలలో ఎన్నో లోపాలున్నట్లు పెద్దలు కనుగొంటారు. వాటికి కారణాలు తెలియకుండానే పిల్లల్ని శిక్షిస్తారు. నిజానికి పిల్లల భయాలకి, దురలవాట్లకి, విపరీతప్రవర్తనలకి పెద్దలే కారణం. అవన్నీ చక్కదిద్దాలంటే సున్నితమైన, హాస్యధోరణిలో కూడా సాధ్యమౌతుందని చెప్పే నాటికఇది. చిత్రవిచిత్రమైన లక్షణాలతో, అంతుచిక్కని జబ్బులతో తన దగ్గరకు వచ్చిన బాలరోగులను చూసే డాక్టర్ బి. నందం పూర్తి పేరు 'బాలానందమ్'.

ఇందులో పాత్రలు

డాక్టరు - బి.నందం

కాంపౌండరు - నర్సు

వినికిడితక్కువ అబ్బాయి - వాళ్ళ అమ్మ

భీమారావు - అతని తండ్రి

అజంతా సుందరి - ఆమె తల్లి

చదువుల అబ్బాయి -- అతని తాత

పరీక్ష పాపాయి - వాళ్ళ అన్న

(కర్టెను తీసేసరికి డాక్టరుగారి డిస్పెన్సరీ, బల్లలు, కుర్చీలు, టేబిలు, బేసిను, మందుల సీసాలు వగైరా. డాక్టరు కూర్చుని రాసుకుంటూ ఉంటాడు. లోపల నుంచి కేకలు- ప్రజలు విడివిడిగా అంటున్న మాటలు వినిపిస్తాయి. "అమ్మో! నిల్చుని, నిల్చుని కాళ్ళు పీకుతున్నాయి." "ఇంకా ఎప్పుడమ్మా తెరిచేది?" "మాచంటోళ్లే పట్టుకో లేకుండా ఉన్నాం బాబూ!" వంటివి)

(కాంపౌండరు బయటనుంచి ప్రవేశించి, అలసిపోయి, అయూవ పడిపోతున్నట్లు)

కాంపౌం: డాక్టర్! ఒకటే జనం. ముందు గేటు తీసి పేషంట్సుని వరుసలో నిలబెట్టాం. . . . ఈ గల్లీ చివర వరకు లైను పెరిగిపోయింది డాక్టర్!

డాక్టర్ : (వినిపించుకోనట్లు అలాగే వ్రాసుకుంటూవుంటాడు)

నర్సు: (బయటనుంచివస్తూ- తలుపుదగ్గరనిలబడి) - "ఆగండమ్మా!" టైము అయితే గానీ డాక్టరుగారు డిస్పెన్సరీ తెరవరమ్మా. ఆ. . . టైమ్ అంటే టైమే! (డాక్టరుగారిని చూసిగొంతు తగ్గించి-)"ఆడవాళ్ళు ఈవేపులైను, మగవారు ఆవేపులైను. పిల్లలు పరుగెత్తకుండా పట్టుకోండమ్మా!" (అని చెబుతుంది.)

కాంపౌం: (డాక్టరుగారివంక చూస్తూ) సిస్టర్! పిల్లపేషంట్లు ఏమంటు న్నారు?

నర్సు: (గొంతుతగ్గించే) ఏమంటారు కాంపౌండరుగారూ! గోల చేస్తున్నారు. బిస్కట్లు తింటున్నారు. ఏడుస్తున్నారు. పెద్ద లుమాత్రం వాళ్ళని సముదాయించలేక, అడిగినవి కొనివ్వలేక ఇబ్బంది పడిపోతున్నారు.

కాంపౌం: ఆ పెద్దవారిని చూస్తేమాత్రం చాలా జాలిగా వుంటుంది!

డాక్టరు: (బల్లమీద వున్న గంటకొట్టి) పిలవండి ఒక్కొక్కరిని. (నర్సు ఈ లోగా వెళ్ళి ఒక ట్రే నిండా పరికరాలు పట్టుకొస్తుంది)

కాంపౌ: (బయటి తలుపు దగ్గర నిలబడి) ఒకటో నెంబరు పేషంటు బాబు, వాళ్ళమ్మగారు. . . రండి (అంటాడు బిగ్గరగా)

తల్లి: (ఆదుర్దాగానడిచివచ్చి) డాక్టరుగారూ! పదిహేనురోజులనుంచి నండీ మావాడికీ ఈ జబ్బు. పుట్టినప్పట్నించి బాగానేవు న్నాడు, ముఖం చెవులు, ముక్కు చూడండి. అన్నీ బాగు

న్నాయి. ఒకవాపులేదు, ఒక నొప్పిలేదు, తిండి తింటాడు, నిద్రపోతాడు. కానీ ఈ జబ్బేమిటో అంతు చిక్కటం లేదు. మంత్రాలు వేయించాం. విభూతి పెట్టించాం.

డాక్టరు: ఆగండమ్మా! అబ్బాయీ. . . ఇలా దగ్గరగారా. (విననట్లు ఎటోదిక్కులు చూస్తూంటాడు) ఏయ్‌బాబూ! నిన్నే.

నర్సు: అబ్బాయీ! నిన్నేనయ్యా డాక్టరుగారు పిలిచేది. వినిపించు కోవేం?

తల్లి: అయ్యో! ఇదేనండే అసలు జబ్బు. ఉన్నట్లుండి రెండు చెవుల్లోనూ చెవుడు వచ్చిపడినట్లుంది. బ్రహ్మాండాలు బద్దలైనా వినబడదు. (పిల్లాడినిగుంజి, సైగలతో డాక్టరుగారిని చూపి స్తుంది.) డాక్టరుగారూ! ఒక్కగానొక్క కొడుకండీ చూడండి, ఈ చెవులు శ్రీకారాల్లాగా ఎంత ముద్దువస్తున్నాయో! (అని చెవికొసముట్టుకుంటుంది)

అబ్బాయి: (కీచుమని) అమ్మో! ముట్టుకోకండి. నొప్పి, నా చెవులు పట్టుకోవద్దని ఎన్నిసార్లు చెప్పాను? ఎంతమంది డాక్టర్ల దగ్గరకి తీసుకుని వెడతావు? ఏం చేసినా ఈ చెవులు బాగుపడవు.

డాక్టరు: నర్స్! (అనగానే బాబుని దగ్గరకు తీసుకొనివస్తుంది) అటూ ఇటూ చెవుల వెనుక పరీక్ష చేసి, రెండూ వినబడడం లేదా అని సైగ చేస్తాడు. (లేదని అబ్బాయి మూగజవాబు) అమ్మా! మీ అబ్బాయిని ఈ రాత్రికి ఇక్కడ వుండనివ్వండి.

నర్సు: ఎస్ డాక్టర్! (అని అబ్బాయి చేయి పుచ్చుకొనిలోపలికి తీసుకుని వెడుతుంది.)

తల్లి: (వెంటనడుస్తూ) మావాడు ఎక్కడా వుండడమ్మా! రాత్రంతా ఏం పనమ్మా? బుర్ర, బుద్ధి, చూపు అన్నీ బాగానే వున్నాయి. మాయదారి చెవులకే వచ్చిపడింది.

కాంపౌం: పదండమ్మా. లోపలికి వెళ్ళి విషయం తెలుసుకోండి. మీరు అరిస్తే డాక్టరుగారికి ఇష్టం వుండదు. (అనగానే ఆమెమాట ఆపేసి, డాక్టరుకి దణ్ణంపెట్టి లోపలకు వెడుతుంది. నర్సు బాబువెంట)

కాంపౌం: నెక్స్టు కేసు! (అని బెల్లుకొడతాడు)

(చేతులు రెండింటికీ మోచేతుల వరకు బట్టలు చుట్టుకుని ఒక అబ్బాయి వస్తాడు వస్తాదులాగా నడుచుకుంటూ.)

డాక్టరు:(ఎగాదిగా చూసి) నీపేరు?

భీమ:భీమారావు (దూకుడుగానే వుంటాడు)

డాక్టరు:ఏమయింది బాబూ? సుస్తీ ఏమిటి?

భీమ:ఈ చేతులు రెండూ మోచేతులనుండి వేళ్ళవరకు విపరీతంగా వాచిపోయాయి!

డాక్టరు:ఎప్పటినుంచీ ఈ వాపు?

భీమ:పది రోజుల నుంచి.

డాక్టరు:నొప్పివుందా? (అనిముట్టుకుంటాడు. అబ్బాయి కదలడు)

భీమ:లేదు. వాచిపోయి బాగా బరువెక్కిపోయాయి ఏ పని చేద్దామన్నా వేళ్ళు ఇంతింతలావు. ఏదీ చేత కావడంలేదు.

డాక్టరు:ఈ అబ్బాయి వెంట పెద్దవాళ్ళెవరూ రాలేదా?

నర్సు:వాళ్ళ నాన్నగారు వచ్చారు. దూరదూరంగా నక్కినక్కి వెనకాలే నిలబడిపోతున్నారండే! ఈ అబ్బాయిని చూస్తే ఎందుకో భయపడుతున్నట్టున్నారు డాక్టర్.

డాక్టరు:బాబూ! ఇల్లా ధగ్గరగా రండి. మీ అబ్బాయికి వచ్చిన బాధ ఏమిటి?

తండ్రి:పదిరోజులనాడు వాళ్ళస్కూలు నుంచి తిరిగివచ్చేటప్పటికి చేతులు వాచిపోయాయండీ! అంతకుముందు రెండు రోజులు ఊళ్ళో చాలా గొడవలైనాయి కదండీ! ఏడు రోడ్లమీద తిరిగాడు పిల్లలతో కలిసి. ఏదైనా వాతం వచ్చిందేమోనని ఏదో వైద్యం చేశామండీ! కానీ ఆరోజుకారోజు వాపు ఎక్కువైపోయి, లావుగా తయారైపోయి. ఇలా సొరకాయల్లా తయారయినాయి.

డాక్టరు:ఐ.. సీ! ఈ కట్లు ఎవరు కట్టారు?

తండ్రి:గాలిపోసుకుని ఊరిపోతున్నాయేమోనని వాళ్ళ అమ్మ కట్టిందండీ. ఏ డాక్టరుకీ అంతుచిక్కలేదు. మా సందులోని డాక్టరుగారు రెండు ఇంజక్షన్లు ఇచ్చారు. పెద్ద రోడ్డు మీది

స్పెషలిస్టుగారు పన్నెండు రకాల మందులు వ్రాసిఇచ్చారండీ! హాస్పిటల్‌కి వెడితే ఫారిన్ నుంచి వచ్చిన పెద్ద సర్జన్‌గారు, మూడు నెలలు చూసి ఆపరేషను చేయాలన్నారండీ!

డాక్టరు:(చిరునవ్వుతో) ఓహో! అదా సంగతి! అర్థమైంది. . . నర్స్!

నర్సు:ఎస్.. డాక్టర్!

డాక్టరు:ఈ అబ్బాయిని లోపలకు తీసుకువెళ్ళి, ఈ కట్లన్నీ విప్పెయ్. రెండు చేతులు లోషనులో వేసి నానెయ్యి.

నర్సు:ఓకే డాక్టర్!

డాక్టరు:చూడండి, ఈ రాత్రికి మీ అబ్బాయిని ఇక్కడే వుంచాలండీ! అడ్మిషన్ చిటీ వ్రాస్తున్నాను. మీరూ లోపలకు వెళ్ళండి.(భయంగా)

తండ్రి:లోపల ఆపరేషను చేసే వస్తువులు వుంటాయాండీ?

డాక్టరు:ఉన్నా ఫరవాలేదండీ! అసలు సుస్తీ ఏమిటో అర్థమైందిగా! అది కుదిరే ఏర్పాటు చూస్తాను.

కాంపౌం:పదండి లోపలకు. భీమారావూ! నువ్వుకూడా లోపలికే.

డాక్టరు:(బెల్లుమోగించి) నెక్స్ట్!

అమ్మాయి:(వయ్యారంగావచ్చి) నేను రావచ్చునా డాక్టరుగారూ!

డాక్టరు :(పరీక్షగాచూస్తూ) రాఅమ్మా!

అమ్మాయి:(మరొక నాలుగడుగులు అతి వయ్యారంగా వేసి, ఒక నృత్య భంగిమలో నిలబడుతుంది)

తల్లి:ఆగుతల్లీ! నా దగ్గరకు వచ్చి నిలబడమ్మా! ఇది డాక్టరుగారి ఆస్పత్రి. బుద్ధిగా నిలబడి, తలెత్తు.

అమ్మాయి:అల్లాగే అమ్మా! (అంటూ స్టేజి చివరివరకు వెళ్ళి అజంతా సుందరి అద్దం చూసుకుంటున్న భంగిమలోకి మారిపోతుంది.)

డాక్టరు:నర్స్! ఆ అమ్మాయిని ఇలా తీసుకురా.

నర్సు:పదమ్మా! నువ్వు ఇలా దూరంగా నిలబడితే, డాక్టరుగారు ఎలా పరీక్ష చేస్తారు? అరే! ఇంకాదూరం వెడతావేం?

చేయిపట్టుకుంటుంది.

అమ్మాయి:(కెవ్వున కేకవేసి) ఆ. . .ఆ. . . ముట్టుకోకండి. ఈ తామరతూడునలిగిపోతుంది. హస్తపద్మమూకందిపోగలదు. నేనే వస్తాను. మీరు నడవండి. సంపంగి పువ్వులాంటి నాముక్కు. కలువరేకులవంటి నా కన్నులు,, విల్లువంటి నా కనుబొమలు చూశారా? అన్నీ ఎంతో బాగా పనిచేస్తున్నాయి. కానీ నా కాలు చేతులు మాత్రం సరిగా నిలబడకుండావున్నాయి.

డాక్టరు: ఓహో! ఎన్నాళ్ళ నుండో సరిగ్గా నిలబడ లేకపోవటమనే జబ్బు? (అంటూండగానే అమ్మాయి మరొక పోజు పెట్టేస్తుంది స్టేజిమధ్యకు వచ్చి)

తల్లి: ఎన్నాళ్ళో కాలేదండీ! నాలుగైదు నెలలనుండి. మొగలి రేకు లాంటి ఆ పసిమిరంగు, నల్లతాచులాంటి వాలుజడ చూశారా డాక్టరుగారూ! అపురూప సుందరి నాతల్లి. నా గారాల కూతురు ఇలా బొంగరంలా తిరిగిపోతోంది. నాకడుపు తరుక్కుని పోతోంది డాక్టరుగారూ(దుఃఖంగా)

డాక్టరు: ఔనమ్మా! చూడగా అలాగే అనిపిస్తోంది. నీపేరేమిటమ్మా?

అమ్మాయి: నాఅసలు పేరా? అందరూ పిలుస్తుండేపేర్లా?

డాక్టరు: పేర్లు అంటున్నావు - ఎన్ని పేర్లున్నాయేమిటి?

తల్లి: (నవ్వి) అవునండీ. మావీధిలో వారంతా హిందీనాట్యతార వైజయంతీమాల అంటారండీ! మాపక్కింటివాళ్ళు మాత్రం 'మాలిని' అంటారు. వాళ్ళకళ్ళకి అలా కనిపిస్తుంది. బంధువులంతా మన తెలుగుస్టార్ 'దేవి' పేరుతో పిలుస్తారండీ! అసలు పేరు మాత్రం వీర వెంకట లక్ష్మీతాయారు.

అమ్మాయి: (కెవ్వుమని అరిచి) అబ్బా! నన్ను ఆ పాతచింతకాయ పేరుతో పిలవొద్దు.(వయ్యారాలు పోతూ ఇంకొక వైపునడచి వెడుతుంది)

డాక్టరు: ఆహా! బాగుంది. అయితే నీకు ఈ నాట్యభంగిమలు ఎవరు నేర్పించారు?

అమ్మాయి: ఒకరు నేర్పే అవసరం లేదు డాక్టర్! నా హస్తాలు, పాదాలు అన్నీ వద్దన్నా ఇలాగ మెలికలుగా తిరుగుతుంటాయికదా! నా చేతిలో వున్నది అద్దం. నాఅందానికీ, చందానికీ ఆయువు పట్టు ఈ అద్దం. స్కూలుకి వెళ్ళే చౌరాస్తాలో పెద్ద పోస్టరు

మీరు చూడలేదా డాక్టర్? ఆ సినిమా సుందరి ఇలాగే నిలబడివుంటుంది. ( అని మళ్ళీ జుట్టు దిద్దుకుంటున్నట్టు ఫోజు)

తల్లి: అమ్మాయీ! అంతంత పెద్ద డైలాగులు చెప్పకమ్మా! శంఖం వంటి నీమెడ వాచిపోతుంది. గులాబీరేకుల్లాంటి ఆ పెదవులు కమిలి పోతాయి. లతాంగి లాంటి నాబిడ్డ ఈ ఆస్పత్రిలో మందుసీసాల మధ్య ఏమిటో! (పెద్దగా మూలుగుతుంది)

అమ్మాయి: నేను ఏపనీ చేయలేకుండా వున్నాను డాక్టర్! నాచేతులు ఇలా నాట్యం చేసేస్తోంటే, నాకు ఏదో జబ్బు చేసిందని భయమేస్తోంది. స్కూలులో అందరూ నవ్వుతున్నారు. వయ్యారి నడకలతో గేటునుంచి క్లాసుచేరేసరికి అరగంట పడుతోంది.

డాక్టరు: అంత కష్టం దేనికమ్మా! మామూలుగా గబగబా నడచి వెళ్ళిపోవచ్చునుగా!

అమ్మాయి: అయ్యో! అదే కదండీ చెప్పేది! నాఇష్టం ఏమీలేదు. చూశారా, చూశారా మరో ఫోజు ఎలా వచ్చేస్తోందో!

డాక్టరు: అవునమ్మా, నాకు అర్థమైంది. కాంపౌండర్!

కాంపౌండర్: ఎస్.. డాక్టర్! ఈమెని కూడా... నరసమ్మగారూ!

నర్సు: (ఉరిమిచూస్తుంది) సిస్టర్ అనండి! నరసమ్మకాదు. పదపాపా, లోపలికిపద అమ్మా! మీరూ రండి.

డాక్టరు: (బెల్లుమోగించి) నెక్స్ట్

తాత: అయ్యా! డాక్టరుగారూ! మిమ్మల్ని గురించి దేశమంతా ఎంతో ఇదిగా చెప్పుకుంటుంటే విని, మా మనుమడిని మీ చేతుల్లో పెడదామని తీసుకువచ్చాను. వీడికి నెలరోజుల్నుంచి సుస్తీ. భరించలేకపోతున్నాం బాబూ!

డాక్టరు: అలాగా! బాబూ, ఇలారా, ఏమిటి సుస్తీ?

తాత: ఒక్కక్షణంలో చెబుతానండీ! మీటేబిలు మీదవున్న ఆ పత్రిక మావాడి చేతికివ్వండి. (కాంపౌండరు పత్రిక బాబు చేతికి ఇస్తాడు. అది అతుక్కుపోతుంది)

తాత: ఆ - ఇచ్చారా! ఇప్పుడు మీరు తిరిగి తీసుకోండి.

కాంపౌండరు: (లాగి) రావడంలేదు డాక్టర్!

తాత: అదండీ సంగతి! చిత్రంగా అతుక్కుని పోతుంది. ఇంక ఊడిరాదు.

డాక్టరు: ఐసీ! రాకుండా అతుక్కుని పోతోంది.

నర్సు: మీరుండండి డాక్టర్. కాంపౌండరుగారూ! మీరు ఆ అబ్బాయిని గట్టిగా పట్టుకోండి. నేను కాగితాన్ని లాగేస్తాను. ఊ... అమ్మా! అమ్మయ్య! వచ్చేసింది. (అది గుంజుతుంది)

: తాత: చూశారుకదా! ఆ ట్రేలో వున్న కత్తుల్లో ఒకటి తీసి ఇవ్వండి. ఇవ్వండి సందేహించకండి నర్సుగారూ!

కాంపౌండరు: వద్దండీ తాతగారూ! ఆ కత్తి మీవాడి చేతుల్లోంచి గుంజామంటే, నాకు, మానరసమ్మకి చేతివేళ్ళు నాలుగు తెగికింద పడిపోతాయి. చాలా కష్టం సార్!

తా: ఏమీ తెగవు నాయనా! పెద్దవాడిని మీకంత ప్రమాదం చేయనిస్తానా? ఇవ్వండి.

నర్సు: వద్దులెండి సార్! నాలుగు, నాలుగు ఎనిమిది వేళ్ళు మావి పోతే ఆస్పత్రి నడవడం కష్టం సార్!

డాక్టర్: (చిరునవ్వుతో) తాతగారూ! నాకు అర్థమైంది - బాబూ! ఇలా యీ చిన్న చాకుని చేత్తో పట్టుకో. (అబ్బాయి పట్టుకుంటాడు) ఏది యిలాగివ్వు! అదీ! చాలా తేలిగ్గా యిచ్చేస్తున్నాడు. సరేలెండిగానీ, యీ చీటీ చూడు. (అది యివ్వబోతుంటే)

తాత: (కంగారుగా) వద్దండీ వద్దు. కాగితం అనే పదార్థం మాత్రం మావాడి చేతికి దగ్గరగా రానీయవద్దు. చెప్పరా నాయనా! నువ్వు పడుతున్న కష్టాలన్నీ చెప్పు.

అబ్బాయి: నాకష్టాలకి అంతులేదు డాక్టరుగారూ! మాతాతగారు చెప్పిన మాట నిజం. దుకాణం నుంచి ఏ సరుకైనా తీసుకురావాలంటే కాగితాల పొట్లాలు కడితే లాభం లేదు. అందరూ కలిసి గుంజినా రావు. పొట్లాలు చిరిగిపోతాయి. అందుకనే ప్లాస్టిక్ సంచుల్లో పోయించుకుని వస్తాను. లేదా బట్ట సంచిలో పోయిస్తాను. కాగితం పట్టుకుంటే నా పని గోవిందా!

నర్సు: మరి పుస్తకాలు, కాగితాలు లేకుండా బడికి ఎలా వెడతావు బాబూ!

అబ్బాయి: అదే గదండీ కష్టము! బళ్ళో పుస్తకాలు నా ప్రక్కన వున్న పిల్లలు తీసి నాముందు పెడతారు. పేజీ తిప్పాలన్నా, వాళ్ళే తిప్పాలి. నాపెన్ను మాత్రం కాగితాన్ని తగిలేటట్లు దూరంగా పట్టుకొని రాస్తాను. చేత్తోగానీ కాగితం పొరబాటున తాకితే. నలుగురు పట్టి బలవంతాన లాగ వలసిందే. కాగితాలు పట్టుకోవడానికి చిన్న పట్టకారులు, గరిటెలు, చిమ్టాలు కొని యిస్తానంటున్నారు మా నాన్నగారు.

తాత: అవునండీ, అలాగైతేనే పుస్తకాలు, నోట్సు పట్టకారులతో పట్టుకుని చదువుకుంటాడు.

డాక్టర్: అంటే ఫోర్సెప్స్‌తో చదువు కొన సాగిస్తాడు-

తాత: ఏదో నాయనా! యింతకీ మావాడికి ట్రీట్‌మెంటు ఏముంది! ఎంతమంది డాక్టర్లకి చూపినా ఏదో వ్యాధి అంటూ ఏడిపించారే గానీ——

డాక్టర్: ఫరవాలేదు తాతగారూ! నర్స్!

నర్స్: ఎస్.. డాక్టర్?

డాక్టర్: ఈ అబ్బాయిని-------

నర్స్: ఓకే డాక్టర్! పద బాబూ లోపలికి.

డాక్టర్: ఈ పూటకి యింక కేసులు ఆపేద్దామా?

కాంపౌండరు: (గబ గబ పరుగెత్తుకుంటూ దగ్గరగా వెళ్ళి, చేతులు జోడించి) సార్! సార్! మీరు రెండు. మూడు కేసులే చూస్తాను పూటకి అని రూలు మార్చేయాలి సార్! పిల్లలు, పెద్దలు అలమటించిపోతున్నారు. ('నందం డాక్టర్ బాబూ! సార్, యింకా ఎప్పుడు సార్!' అని నేపథ్యంలోంచి కేకలు)

నర్సు: అవును డాక్టర్! వాళ్ళ బాధలని చూడలేకపోతున్నాము. పిల్లల గోడు భరించలేక పోతున్నాము.

డాక్టర్: సరే చూద్దాం. మరో యిద్దరు పేషంట్సుని పిలవండి. (ఒక అమ్మాయి, అబ్బాయి వాళ్ళ అమ్మ కలసి వస్తారు లోపలకు)

అమ్మ: నమస్కారం డాక్టరుగారూ! నాకు ముత్యాల్లాంటి యిద్దరు

పిల్లలు! అని ఎంతో సంబరబడిపోయేదాన్నండీ. కానీ వాళ్ళిద్దరికీ సుస్తీ చేసిందండీ! అప్పటినుంచి నాపాట్లు భగవంతుడికెరుక. ఇది మా అమ్మాయి. పేరు ధైర్యలక్ష్మి.

డాక్టరు: ఇలా రా అమ్మా! అబ్బో, చాలా ధైర్యంగా వస్తున్నావే! నోరు తెరు. పరీక్ష చేస్తాను. (అనగానే ఆ అమ్మాయి కుర్చీలో పడిపోతుంది) అరెరే, పడిపోయిందేమిటి?

నర్సు: లే అమ్మా! అమ్మగారూ, మీరు పట్టుకోండి (అని యిద్దరూ కలిసి పాపను కూర్చోపెడతారు)

డాక్టరు: అసలే ధైర్యలక్ష్మివి కదా! అలా పడిపోయావేమిటి? ముందు నిన్ను పరీక్ష చేస్తాను. నోరు తెరు (అంటూంటే మళ్ళీ పడిపోతుంది)

కాంపౌండరు: ఏమిటమ్మా! బిడ్డ అలా పడిపోతే పట్టుకోకుండా చూస్తూ నిలబడ్డారేమిటి?

అమ్మ: పడుతుందని నాకేం తెలుసు నాయనా? అసలు ఎప్పుడు పడిపోయేదీ నాకు తెలిస్తే కదా? మొన్న సెప్టెంబరు నుంచి ఈ బాధ జబ్బేమిటో ఎవ్వరికీ అంతు తెలియడంలేదు.

డాక్టర్: చూద్దాంలెండి. సరిగా కూచో అమ్మాయి! నిన్నేమీ కొప్పడను. నా చేతుల్లో ఏవీ కత్తులు లేవు. ఇంజక్షను సూది కూడా లేదు. ఊరికే నిన్ను ప—రీ— క్ష— ఆ—ఆ—వుందు. నువ్వు ఏం చదువుతున్నావు?

పాప: సెవెంత్ క్లాసు అండీ!

డాక్టరు: అలాగా? అన్నము నువ్వే తింటావా?

అమ్మ: బాగా తింటుందండీ! అన్నం కంటే అప్పచ్చులు యిష్టం.

డాక్టరు: భేష్! రోజూ స్కూలుకి నడిచే వెడతావా?

పాప: అవునండీ! నాకు నడవడం కంటే రిక్షా ఎక్కడం ఎక్కువ ఇష్టం.

డాక్టరు: ఇంకేం మరి! వెరీగుడ్! మొన్న పండక్కి బొమ్మలూ అవీ పెట్టావా?

పాప: బొమ్మలు పెట్టడం కంటే టపాకాయలు కాల్చడం యిష్టం.

డాక్టరు: చాలా బాగుంది. మొన్న క్వార్టర్లీ పరీక్షల్లో (అంటూంటే ఆ అమ్మాయి పడిపోతుంది) పట్టుకోండి, పట్టుకోండి. అమ్మా పాపని తీసుకుని మీరు లోపలకు వెళ్ళండి. కేసు నాకు పూర్తిగా అర్థమైంది. ఇంక ఈ అబ్బాయి------

అమ్మ: ఈ అబ్బాయిది యింకో కథండీ. ఇందాకట్నుంచి చూశారో లేదో మీరేం చేస్తే అల్లాగే చేస్తుంటాడు నిలబడి.

డాక్టరు: అబ్బాయీ! ఏం చదువుతున్నావు?

అబ్బాయి: నేను ఏడో క్లాసు ఫెయిలు!

డాక్టరు: ఎందుకని! బాగా చదవలేదా? ఇలారా! (చేత్తో రమ్మని పిలుస్తాడు)

అబ్బాయి: (తనూ డాక్టర్ లాగానే చేస్తుంటాడు)

డాక్టరు: ఎందుకని రెండుసార్లు ఫెయిల్ అయినావు? (అని నాడి పట్టుకుని చూస్తుంటే. ఆ అబ్బాయి డాక్టరుగారి రెండో చేయి పట్టుకుని పరీక్ష చేస్తుంటాడు. ఆయన స్టెతస్కోపు పెట్టినట్లు తనూ, చేయి చాపి డాక్టరుగారిని పరీక్షిస్తున్నట్లు నటిస్తుంటాడు)

డాక్టరు: అంటే ఎవరేది చేస్తే, అదే తనూ అనుకరిస్తాడన్నమాట.

అబ్బాయి: అన్నమాట! (అంటాడు అలాగే)

అమ్మ: అవునండీ! కోతిలాగ నిలబడడం. వాళ్ళు నడిస్తే నడిచి, కూచుంటే కూచుని, నవ్వితే నవ్వీ, తల తిప్పితే తిప్పీ, బుర్ర గోక్కుంటే గోక్కునీ - చాలా గొడవగా వుంటున్నది డాక్టర్! ఆ పిల్లను చూస్తే అలాగు - మూర్ఛపోవడం, యీ పిల్లాడు యిలా కోతి చేష్టలు - నాకు మతిపోతోంది. అన్ని జబ్బులు మీరే కుదర్చాలి - డాక్టరు బాబో! (అని ఏడిచినంత పని చేస్తుంది)

డాక్టరు: నేను చాలా వరకు గ్రహించాను. చికిత్స ప్రారంభిద్దాము. నర్స్!

నర్సు: ఎస్.. డాక్టర్!

డాక్టరు: అబ్బాయిని తీసుకువెళ్ళి యిందాక వచ్చిన డ్యాన్సు పాప దగ్గర నిలబెట్టు. రాత్రంతా యిద్దరూ పోజులు పెడుతూ

కూచుంటారు. కాంపౌండర్ కేసులు ఆపేద్దాం.

కాంపౌండర్: పెద్ద పాములా వున్న క్యూలో చిన్న తలకాయంత కూడా పూర్తికాలేదు.

డాక్టరు: లాభం లేదు కాంపౌండర్! సీరియస్ కేసులు చూస్తున్నాం. రేపటికల్లా వీటి చికిత్స పూర్తయితే ప్రజలకి చెప్పవచ్చు.

కాంపౌండర్: బాలల్లారా! వారి తల్లిదండ్రులారా! (బిగ్గరగా) డాక్టర్ బి. నందంగారు ఆణిముత్యాల్లాంటి అయిదు అర్జెంటు కేసులు తీసుకున్నారు. వాటిని పూర్తిగా రేపటి వరకు నయం చేస్తారు. మిగిలిన వారంతా వెళ్ళిపోవచ్చును.

(తెరపడి మళ్ళీ లేస్తుంది)

డాక్టర్: సిస్టర్! తెల్లవారింది.

నర్స్: ఔను డాక్టర్! రాత్రంతా పుస్తకాలు చదువుతూ, ఒక్కొక్క పేషంటుకీ ప్రత్యేకమైన ట్రీట్‌మెంట్ చెబుతోంటే ఎంతో ఆశ్చర్యంగా అనిపించింది డాక్టర్! మీ ఓపిక చాలా గొప్పది.

కాంపౌండర్: మన డాక్టరుగారు కేసుపట్టడమూ, అది విజయవంతం కాక పోవడమూనా?

డాక్టర్: (పొగడ్త యిష్టం లేనట్లు) ఊ---చాలు!---- రోగులు లేచారా?

నర్సు: రోగులు లేచారు కానీ. వారి వెంట వచ్చిన పెద్దలు నిద్రపో తున్నారు.

డాక్టరు: అలాగా? రోగులను ప్రవేశపెట్టండి.

నర్సు: వాళ్ళనింక రోగులు అనకూడదు. వారి బాధలన్నీ తగ్గిపోయి ఆరోగ్యవంతులైనారు.

(పిల్లలంతా వస్తారు లైనుగా)

డాక్టరు: హలో! ఎలాగున్నారు మీరందరూ?

పిల్లలు: నమస్కారం డాక్టరుగారూ!

ఒకరు: మేము బాగుపడ్డాం మా బాధలన్నీ తగ్గాయి

రెండు: మేమింక వెడతాము. మా పెద్దలు కాస్త నిద్దర్లు పోతున్నారు.

మూడు: మమ్మల్ని వెళ్ళమంటారా డాక్టర్?

నాలుగు: ఆ మందు సీసాలన్నీ మాకేనా?

డాక్టర్: ఈ మందు సీసాలు మీకు అవసరం లేదు. అవి మీ పెద్దలకి ఎందుకంటే మీతో గొడవపడి అలిసి పోయుంటారు. అందుకని వాళ్ళకే బలం కోసం ఆ మందులు. యింక మీకేమో బిస్కట్లు, చాక్లెట్లు.

నర్సు: డాక్టరుగారూ! పెద్దలు కూడా నిద్రలు లేచినట్లున్నారు. పిలవమంటారా?

డాక్టరు: రమ్మను సిస్టర్! (అందరూ ఒకరొక్కరే వచ్చి నిలబడతారు) తల్లిదండ్రులకు నా మనవి. మీ పిల్లలకు జబ్బులేమిటో, వాటి కారణాలు, మళ్ళీ తిరగబెట్టకుండా జాగ్రత్తలు ఏమేమిటో చెబుతాను. పిల్లలు కూడా శ్రద్ధగా వినాలి. ఏమంటారు?

పిల్లలు: ఓ! వింటాము.

పెద్దలు: చెప్పండి డాక్టరు బాబూ!

(బాల రోగులు విడివిడిగా వారి పెద్దలతో కలిసి నిలబడతారు. ఎవరి కేసు గురించి చెబుతుంటే, వారు ఒక్కడుగు ముందుకు వచ్చి వినయంగా వింటారు)

డాక్టరు: మొట్టమొదటి అబ్బాయి (వినికిడి తక్కువ అబ్బాయి) ఈ అబ్బాయికి యిక్కడకు వచ్చేటప్పటికి సుస్తీ ఏమిటి?

తల్లి: బ్రహ్మాండమైన చెవుడుతో బాధ పడుతున్నాడండీ!

డాక్టరు: అంతకు మునుపే. అంటే యీ రోగం ముదరక మునుపు మీరు ఏవైనా మార్పులు గమనించారా అమ్మా?

తల్లి: (ఆలోచించి) ఈ చెవుడు వల్లనో ఏమో ఎంత పిలిచినా వినిపించుకునే వాడు కాదు. పలకడమే లేదు.

డాక్టరు: సరిగ్గా చెప్పారు. బాబూ! నువ్వు మొండితనం నేర్చుకుని మీ అమ్మ, నాన్న మాటలు వినడం మానేశావు. బళ్ళో టీచరు చెప్పే పాఠాలు వినిపించుకోవడం బొత్తిగా మానేశావు. అమ్మ వందసార్లు చెబితే కానీ నిద్ర లేచేవాడివి కాదు, పాలు తాగడానికి ఒక పదిసార్లు, హోంవర్కు పూర్తిచేయడానికి మరో పదిసార్లు, పుస్తకాలు చక్కగా సర్దుకోవడానికి యింకొక పదిసార్లు - అమ్మ చెప్పవలసి వచ్చేది. అంటే అర్థమేమిటి నువ్వు నీ శ్రవణేంద్రియాన్ని చెవులను ఉపయోగించడం పూర్తిగా మానేశావు. నిజమేనా?

అబ్బాయి: (తలవంచుకుని) అవునండీ! ఏం చెప్పినా వినేవాడిని కాదు. అదే చెవుడుగా మారిందా డాక్టరుగారూ?

డాక్టరు: ఇంకా సందేహమా? నీ చెవులకు వాటి అవసరం లేదని తెలిసి, పని చేయకుండా మూసుకుని పోయాయి. నిన్నరాత్రి చెవుల్లో బాగా నీరు పిచికారి చేసి, నీ చిన్నప్పుడు మీ అమ్మ పాడిన జోలపాటలు వినిపించాం. అవి వినగా వినగా నీ చెవులకు ప్రాణం వచ్చి, మళ్ళీ పని చేస్తున్నాయి.

అబ్బాయి: అవును డాక్టర్! ఇక నుంచి బుద్ధిగా పెద్దల మాటలు వింటాను.

డాక్టరు: రెండో పేషెంటు, భీమారావు పేరుకి తగ్గట్లు చాలా బలమైనవాడు.

నర్సు: అవును డాక్టర్! నిన్న ట్రీట్‌మెంటు యిస్తూవుంటే, ఒక బేసిను విసిరేశాడండీ! అది మన ప్రహరీ గోడ దాటి ఎగురుతూ వెళ్ళింది. ప్రక్కింటి ప్లీడరుగారు కుర్చీలో కూర్చుని కేసులు చదువుకుంటుంటే ఆయన తలమీద టోపీలాగ పడింది. నేను గోడ దూకి వెళ్ళి. ప్లీడరుగారి తల డ్రెస్సింగ్ చేసి వచ్చానండీ. కాంపౌండరుగారు పొద్దునే బేసిన్ సొట్టతీయించడానికి పట్టుకెళ్ళారండీ (అందరూ నవ్వుతారు)

డాక్టరు: ఆ -- ఆ చాలు. ఆ కథంతా తెలుసు. భీమారావూ! నువ్వు యిదే విధంగా యింట్లో వస్తువులన్నీ విసిరేస్తూ వుండేవాడివి కదూ?

భీమా: (తలవంచుకుని) అవునండీ. అయామ్ సారీ!

డాక్టర్: అంతేకాదు. మీ బడిలో ఏ స్ట్రయికు జరిగినా నువ్వు ముందు వుండి కిటికీ అద్దాలు పగుల కొట్టావు. రోడ్డు మీద లైట్ల మీద రాళ్ళు విసిరి వాటినీ ముక్కలు చేశావు. ఆ పనుల వల్ల నీ చేతులు రెండూ వాచిపోయాయి.

తండ్రి: మీరు చెప్పింది అక్షరాలా నిజం సార్! ఆనాటి నుంచే వాపు మొదలై, విపరీతమైపోయి, బట్టలు చుట్టి కాపాడాం డాక్టర్!

డాక్టర్: భీమారావ్! మనకి చేతులు ఎందుకున్నాయి?

భీమా: (ఆలోచించి) పని చేయడానికండీ!

డాక్టరు: సరిగ్గా చెప్పావు. మంచి పని చెయడానికి ఏ చేతులు అందుకు ఉపయోగిస్తే వాపు అనేది రాదు. రాత్రంతా నీ చేతులకి అహింస బ్రాండు ఇంజెక్షన్లు యిచ్చాము. అందుకే సాధువుల్లా పడివున్నాయి.

భీము: వాపు పూర్తిగా తీసేసిందండే! ఇంక ఎప్పుడూ ఏ వస్తువూ విసిరేయను. ఎవర్నీ కొట్టను. రోడ్డు మీద బస్సులు, లైట్ల మీద రాళ్ళు విసరను.

డాక్టరు: మంచి బాబు! ఇంక తర్వాతి కేసు.

నర్సు: ఈ అమ్మాయి రాత్రి పన్నెండు గంటలకల్లా డ్యాన్సు మానే సింది. దాంతో రోగులకి కాలక్షేపం లేక గొడవ చేశారు.

డాక్టరు: అది తెలుసు. మీరందరూ, ముఖ్యంగా టి.వి.లు, సినిమాలు ఎక్కువగా చూసే పిల్లలు జాగ్రత్తగా వినాలి యీ కేసు విశేషాలు. పాపా! నువ్వు రోజులో ఎన్ని గంటలు అద్దం ముందు కూర్చుంటావు? ఎన్ని గంటలు టి.వి. చూస్తావు. సినిమాలు చూస్తావు? రేడియోలో పాటలు వింటావు? సినిమా బొమ్మలు చూస్తావు?

తల్లి అవును డాక్టర్! నిద్రపోయేటప్పుడు తప్ప, మిగతాసమయ మంతా యిదే పనిలో వుంటుంది. ఎంత చెప్పినా క్లాసు పుస్తకాలు ముట్టుకోదు సార్! ఐనా యీ కాలం పిల్లలు అందరూ అంతే కదా?

డాక్టరు: కాదు తల్లీ! మితంగా వుంటే ఫరవాలేదు. కానీ యీ పాప చూసే వాటి సంఖ్య మరీ ఎక్కువ. అదంతా ఒక సినీ విషంగా మారి యీ అమ్మాయి నరాల్లోకి ఎక్కింది. అది మెదడు వెనుక భాగంలోకి వెళ్ళి గట్టిగా పేరుకుని పోయింది. ఆ గడ్డ - సినీపాషాణం అనవచ్చు - అది సినిమా సంకేతాలు శరీరమంతా పంపిస్తూ వుండేది. ఆ గడ్డని 'వివేక్' అనే ఎక్స్‌రే కిరణాలతో కరిగించాము. ఇదుగో యీ 'సినీ గరళ విరోధి' పుచ్చుకుని రోజుకి ఒక్క ఐదు నిముషాలు మాత్రం అద్దంలో చూసుకోవాలి. నెలకి ఒకే ఒక్క సినిమా అది కూడా పిల్లలకి పనికి వచ్చేది చూడాలి.

తాత: అది మన దేశంలో లాభం లేదండీ నందం డాక్టరు గారూ!

డాక్టరు: నిజమే తాతగారూ! అమ్మామీరు మీ అమ్మాయిని ఎప్పుడూ

పొగుడుతూ, ఏదో సినీతారలాగా వున్నావని పోలుస్తుంటే ఆమె బుర్ర అంతా అదే నిండిపోయింది.

తల్లి: సరే డాక్టరు బాబూ! మా వీధిలో అందరికీ చెబుతాను యీ జబ్బు లక్షణాలు.

డాక్టరు: తాతగారూ! మీ మనుమడికి చదువు మోతాదు ఎక్కువైందండీ! ఆటలు, పాటలు, వ్యాయామం అన్నీ మానేసి క్లాసు పుస్తకాలు చదివి చదివి వ్రేళ్ళ చివర అయస్కాంత శక్తి ఏర్పడింది. దాన్ని కాగిస్కాంతం శక్తి అనవచ్చును. కాగితాలు, పుస్తకాలు చుట్టూ అతను వుండడం వల్ల అదే లోకమై. చేతులకి అతుక్కుని పోతున్నాయి.

తాత: అబ్బ! ఎంత బాగా చెప్పారు డాక్టర్! చిరంజీవివై వర్ధిల్లు. వీడు పుస్తకాల పురుగై పోయాడన్నమాట. రోజుకి అరగంట మించి చదవనీయకుండా చూసే పూచీ నాది. అందుకేనా రాత్రంతా వ్యాయామం చేయించి, చక్కని పాటలు వినిపించి, ఆటలు ఆడించారు.

కాంపౌండరు: డాక్టరుగారూ! యీ అన్నా, చెల్లీ పోతామంటున్నారు యింటికి.

డాక్టరు: ఈ పాపకి పరీక్షలంటే భయం. అందుకని నేను స్టెతస్కోపుతో పరీక్ష చేస్తాను అనగానే, ఆ మాట విని మూర్ఛపోయింది. ఇంక వాళ్ళ అన్నకి కాపీ చేయడం జబ్బు. క్లాసులో కాపీ చేసినట్లే యింట్లోను, వీధులోనూకూడా అందర్నీ కాపీ చేస్తున్నాడు.

నర్సు: మీరు చెప్పినట్లుగా, యీ పాప చేత రాత్రి తెల్లవార్లూ, ఏడో తరగతి పరీక్ష పేపర్లు మూడేళ్ళవి వెనకనుంచి ముందుకీ ముందునుంచి వెనక్కీ చదివించాము కదండీ!

కాంపౌండరు: ఆ అబ్బాయికి కళ్ళకి రుమాలు కట్టి, ఎన్నో పనులు స్వంత మెదడు ఉపయోగించి చేయడం అలవాటు చేశాము. ఇప్పుడింక ఆ గంతలు విప్పనంటున్నాడు. ఎవర్నీ కాపీ చేయకుండా, స్వంతంగా ఆలోచించడమే బాగుందట.

తల్లి: బాబూ గంతలు విప్పుతానురా

బాబు: వద్దమ్మా, వద్దు!

డాక్టరు: అర్థమైంది కదా? పరీక్షలంటే అనవసరమైన ఆదుర్దా పెంచు

కుని, అసలు చదవడం మానేస్తే, అది విపరీతమైన ఒక భయంగా మారింది. ఆ భయం పోగొట్టాము. 'పరీక్ష' అనే మాట వింటూనే స్పృహ తప్పేది. యిప్పుడెంతో ధైర్యవంతురాలైంది. ఎవరి తెలివి వారు ఉపయోగించాలి. ఇక్కడున్న తల్లితండ్రులందరికీ యీ సంగతులు అర్థమైనాయి కదా!

(ఓ అని తలకాయ ఊపుతారు)

ఇదే విషయాలు పుస్తకంగా డా||బి.నందం వ్రాస్తున్నారనీ అది గృహవైద్యంగా పిల్లల ప్రత్యేకమైన జబ్బుల చికిత్సకు వాడుకోవచ్చునని చెప్ప కాంపౌండర్!

అందరూ: నమస్కారం డాక్టర్! వస్తామండీ!

(అందరూ వెడుతుండగా, తాతగారు వెనక్కి తిరిగివచ్చి)

తాత: నాయనా! పెద్దవాడిని అడుగుతున్నాను గానీ - ఏమీ అనుకోకు బి. నందం అనే యీ పేరు ఏమిటి? ఏ ప్రాంతం మనది? పూర్తి పేరు ఏం పెట్టారు.

డాక్టరు: (నవ్వి) అదా? బి. నందం అంటే బాలానందం అండీ! నేను పుట్టింది బాలల దినోత్సవం నాడే. నేను చదివిన విద్య బాలల ఆనందం కోసమే.

(అది విన్న వారందరూ వెనక్కి తిరిగి)

డాక్టర్ బి. నందం జిందాబాద్!

డాక్టర్ బి. నందం జిందాబాద్!

(అని నినాదం చేస్తారు)

డాక్టరు: నర్స్!

నర్సు: ఎస్.. డాక్టర్! నెక్స్ట్ కేసు?

డాక్టరు: నో సిస్టర్! ముందు పుస్తకం వ్రాయాలి.

# మంచినీళ్ళ ప్రాయం

పిల్లలు అన్ని పనులూ నేర్చుకుని వుండాలి. చిన్నప్పటినుంచి ఇంటి పనులు, బయటి పనులు అమ్మ, నాన్న చెప్పినట్లు చేస్తూవుంటే అన్ని-ట్లోనూ ఆరితేరుతారు. ఇంట్లో ఎంతో సాయంగా వుండడమేకాక, పెద్ద-యాక అన్నీ సులువుగా చేసుకోగలుగుతారు.

అయితే, ప్రతిదీ తమకే వచ్చును అనుకోవడంగానీ, ఏదీతమకిరాదు అనుకోవడం గానీ మంచిదికాదు. ఈ సంగతి చెప్పేనాటిక.

పాత్రలు :

రమణ - తండ్రి

సీత - తల్లి
రూప - కూతురు
శోభ - చుట్టాలావిడ
శ్రీకాంత్ - ఆమెకొడుకు

రంగం :ఒకే గదిలో ఇంట్లో జరుగుతుంది నాటిక మొత్తం.

(రూపకూర్చుని వ్రాసుకుంటూ వుంటుంది. తండ్రిరమణ బయట నుంచివస్తాడు. చెప్పులు విడచి, కుర్చీలో కూలబడతాడు.)

రమణ :సీతా! సీతా! కొంచెం మంచినీళ్ళు తెచ్చివ్వు, ఉష్! అబ్బ! చలికాలంలో కూడా ఈఎండ ఏమిటో? వేడి చూస్తొంటే ఎండాకాలాన్ని మించిపోయినట్లుంది.

రూప :నాన్నా! ఎండకాలం అప్పుడే వచ్చేసిందా? అంటే బజార్లో మామిడి పళ్ళు వచ్చేస్తున్నాయా!

రమణ :వచ్చినా వస్తాయితల్లీ మామిడి పళ్ళు! మాతాతయ్య అనేవాడు కలికాలంలో అన్ని కాలాలు ఒకటేఅని, మండే ఎండల్లో జోరున వానలు. ఇప్పుడేమో తలకాయ మాడే టట్లు ఎండలు, సీతా! మంచినీళ్ళు.

సీత :(లోపల్నుంచివస్తూ) ఇదిగోండి మంచినీళ్ళు. మీరు వచ్చిన అలికిడి వినగానే చేతిలోపని మానుకుని గ్లాసుకడిగి నీళ్ళు తెస్తున్నాను. ఇంతలోనే రెండుసార్లు కేకలు. ఐనా చిన్నపిల్ల ఇంట్లోవుంది కదా! నాకు ఏపని సులువుకాదు. అన్నిపనులూ నామీదేవుంటాయి.

రమణ :ఔనమ్మా రూపా! నాకు తోచనేలేదు సుమా! నేనురా గానే నువ్వులోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెస్తే అమ్మకు కొంచమైనా సాయంకదామ్మా!

రూప :లేదు నాన్నగారూ! నేనుగ్లాసులు ఎప్పుడూ వంపేస్తూం టాను. నీళ్ళు ఇల్లంతా ఒలుకుతాయి. నాపరికిణీ తడిసిపోతుంది. అదేమిటోగానీ నాకు ఏగ్లాసూ సరిగా పట్టుకోవడమేరాదు.

సీత :నిజమేలే! రోజుకొక్క సారైనా పాలగ్లాసు వంపేస్తూం టుంది. ఓటిచేతులు. తన మంచినీళ్ళగ్లాసు భోజనాలదగ్గర పడవేసుకుంటుంది. లేదా నాగ్లాసుమీద చేయివేసి అది తిరగ తోస్తుంది. నాకంచం నీళ్ళమయం. ఏంపిల్లో!

రూప :అందుకే నాన్నగారూ! నాకుమంచి నీళ్ళగ్లాసులపని చెప్ప కూడదండే! (సీతగ్లాసు తీసుకుని లోపలికి వెళ్ళిపోతుంది)

రమణ :చూడమ్మా రూపా! ఆ దినపత్రిక పేజీలన్నీ కింద పడే శావేమిటి? మడిచిపెట్టేయ్! బోలెడుధరలు ఈరోజుల్లో పేపర్లు

రూప :నాన్నగారండీ! పేపరా! నావేమో చిన్నచేతులు. చేటల్లా పెద్దపెద్ద పేపర్లు, అదేమిటోగానీ, నాకింత పెద్దపేపరు మడతపెట్టటం రానేరాదండీ! అన్నీ నలిగిపోతాయి. మళ్ళీ, పేపరంతా ఇంత నలిపివేశావేమిటి అని అమ్మ, మీరు నన్నుకోపడ్డం.

రమణ :నిజమేలే! నేనే మడిచేస్తాగానీ, ఈ కందువాలోపల స్టాండు మీద వేసిరా! (అని కిందకువంగి పేపర్లు తీసిమడుస్తూ వుంటాడు. కందువా కుర్చీమీద వుంటుంది.)

రూప :నాన్నగారండీ! కందువానేను లోపల పెట్టాలా? ఆ ఇస్త్రీ మడతలన్నీ పాడైపోవూ? స్టాండు మీద వేద్దామంటే, ఎందుకనో, దానిమీద వున్నమొత్తం బట్టలన్నీ కిందపడి పోతాయి. అందుకే అమ్మ నాకు ఇలాంటి పనులు చెప్పనే చెప్పదండీ!

రమణ :అలాగా! పోనీలే మంచిదే. బట్టలన్నీ కింద పడిపోతే మడతలు పోతాయి. మట్టి అవుతాయి. మళ్ళీ ఉతికి, ఇస్త్రీలు చెయ్యాలి. సరే, సరే, నువ్వు చదువుకో.

సీత :మీరు చెప్పటమూ బాగానేవుంది. రూపా! గంటసేప ట్నుంచి పుస్తకం ముందేసుకుని కూర్చున్నావు. ఇకలేచి, సందు చివరనుంచి, కాసిని పచ్చిమిరపకాయలు తెచ్చిపెట్టు, అలాగే ఒకనిమ్మకాయ, కాస్త అల్లంకూడా తీసుకురా, లేమరి.

రూప :అమ్మో! పచ్చిమిరపకాయలే! బాబోయ్, నాచేతులు మండిపోతాయి. మనింట్లో మామూలు కూరగాయల బుట్ట ముట్టుకుంటేనే, చేతులు ఎర్రగా కందిపోయాయి. ఆచేత్తో పొరబాటున కళ్ళు నులుముకుంటే భగ్గున మంట పుట్టింది.

సీత :అయ్యో! అలాగా! ఔనులే చిన్నపిల్లలు పచ్చి మిరపకాయలకి దూరంగా వుండడమే మంచిది. సరేలే, నిమ్మకాయ,

అల్లంమాత్రం కొనుక్కురా. పక్కింటి ఆంటీ నడిగి నాలుగు మిరపకాయలు తీసుకుంటాను.

రూప :నిమ్మకాయ నేను ముట్టుకుంటే చేదుగా అయిపోతుంది. కిందటిసారి గుర్తులేదూ! వాకిట్లోకి నిమ్మకాయలు వస్తే కొన్నావు. నేనువంటింట్లోకి దొర్లించుకొంటూ తీసికొని వచ్చేటప్పటికి చేదుగా అయిందని కోపడ్డావు. గుర్తులేదా అమ్మా!

సీత :ఔనౌను, గుర్తుకు వచ్చింది. ఐనా కాయలు నలిపేస్తే చేదు ఎక్కిపోతాయి. పోనీలే, అల్లం పట్టుకురా.

రూప :ఛ! అల్లం నిండా ఎర్రనిమట్టి!

రమణ :అదేమిటమ్మా! కడిగి యిమ్మను కూరలమ్మిని.

రూప :కడిగితే చెయ్యంతా బురద, బురద!

సీత :నిజమేనండీ! చిన్నప్పట్నుంచీ రూపకి బురదంటే అసహ్యమే. మీరే ఒక్కడుగు వెళ్ళి అన్నీ తీసుకురండి. కందువా ఇక్కడే వుందిగా!

రమణ :నాకు చెప్పాలా! సరే, తప్పుతుందా? సంచీపడేయి!

(అని సీత యిచ్చిన సంచీతీసుకుని, చెప్పులు తొడుక్కుని బయటకు వెడతాడు)

సీత :ఏమిటమ్మా రూపా! అప్పుడే జుట్టంతా రేగిపోయింది. కాస్త దువ్వుకుని జడ అల్లుకో పోయూవా!

రూప :జడవేసుకోవాలంటే చెయ్యి నొప్పి పుడుతుంది. జడవేసుకోవడం నాకెందుకనో అస్సలురానేరాదు. నూనెతోటి చెయ్యంతా జిడ్డు, జిడ్డు.

సీత :సరేలే, చేతిలోపని పూర్తయినాక, నేనే వేస్తానులే. చూడు, జడ వేసుకున్నాక తల్లో పెట్టుకుందువుగాని, రెండు పెద్దగులాబీలు చెట్టుకివున్నాయి. కోసుకుని తెచ్చుకో అమ్మా! అలాగే నాలుగు కనకాంబరాలు కూడా కోశావంటే, చక్కగా మాలకట్టితలలో పెడతాను.

రూప :(కళ్ళు పెద్దవి చేసి) బాబోయ్! గులాబీ చెట్టు నిండా

ముళ్ళే, అంత మంచిపువ్వుల చెట్టుకి గుచ్చుకుంటూ అముళ్ళేవిటో, కనకాంబరాలు కోద్దామంటే సగంసగం తుని గిపోతాయి.

సీత :సరేలే! చీకటి పడేలోగా అన్నీకోసి పెడతానులే. ముళ్ళు గుచ్చుకున్నా ప్రమాదమే. మళ్ళీ డాక్టరుదగ్గరికి పరుగె త్తాలి (అని లోపలికి వెడుతుంది.)

(శోభ, శ్రీకాంత్ వస్తారు బయటునుంచి)

శోభ :వదినా! వదినా! (అనిపిలిచి రూపదగ్గరగావెళ్ళి) ఏమ్మా పాపా! మీ అమ్మ లేదూ!

రూప :నాపేరు పాపకాదండీ! రూప! అమ్మా! ఎవరోవచ్చారు,

శోభ :ఎవరోకాదమ్మా! నేను నీకు అత్తయ్యని ఔతాను.

శ్రీకాంత్ :నేను బావని ఔతాను.

రూప :ఛీ! నాకు బావలులేరు. అమ్మా! ఎవరోవచ్చారు.

శ్రీకాంత్ :మళ్ళీ ఎవరో వచ్చారంటావేం! అత్తయ్య బావ వచ్చారని కేకేయ్.

శోభ :నువ్వూరుకో శ్రీకాంత్! వదినా!

సీత :(వచ్చి) మీరావదినా! ఇదేమిటి? నిలబడ్డారు? కూర్చోండి. ఇదేనారావడం? అన్నయ్య బాగున్నారా? వీడు రెండోవాడా!

శ్రీకాంత్ :కాదండీ! నేను పెద్దవాడినే! రెండోవాడే నాకంటె పొడుగ్గా, పెద్దగా వుంటాడు! (పేపరు తీసె తిరగవేస్తూంటాడు దర్జాగా)

సీత :గుర్తుపట్టలేదు టే రూపా! నాన్నాగారికి ఈ అత్తయ్యగారు దగ్గర చుట్టం. ఏదీ, అప్పట్లో చిన్నపిల్లకదా! మిమ్మల్నందర్ని మర్చిపోయివుంటుంది. అన్నయ్యగారు ఏంచేస్తున్నారు? కులాసానా!

శోభ :మీఅన్నయ్యగారికి ఎన్నిపనులమ్మా! ఎవరిదో తెలిసిన వాళ్ళది పెళ్ళిఅని ఈ ఊరు తీసుకొచ్చారు. ముహూర్తంకాగానే తను వెళ్ళిపోయారు. భోంచేసి మమ్మల్ని ఇలా సాగనంపారు.

సీత :అదేమిటీ? అన్నయ్యగారు ఇంట్లోకి రాకుండా వీధిలోంచి వెళ్ళిపోవడమేమిటి? మళ్ళీ బజారు పని చూసుకుని

వస్తారేమోలే! లోపలికి వెడదాంపదవదినా! కాఫీ, టిఫిను తీసుకుందురుగాని. ఏమోయ్! నీపేరు శ్రీకాంత్ కదూ! పెద్ద పేపరు చదివేస్తున్నావే! ఏక్లాసేమిటి?

శ్రీకాంత్ : నేను ఏడోక్లాసండీ! ఇంగ్లీషు పేపరుచదవటం నాకు బాగా వచ్చునండీ.

శోభ : అవునువదినా! తెలుగు పేపర్లయితే చెప్పనే అక్ఖర్లేదు. గడగడ చదివేస్తాడు. పాపా! కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా!

రూప : నాపేరు పాపకాదండీ! రూప! మంచినీళ్ళ గ్లాసులు నేనుకింద వంపేస్తానండీ!

సీత : అదెందుకు మంచినీళ్ళు తేవడం, నేనే మరిచిపోయాను చూడు. ఎండన బడివచ్చారు. అరుగో, మీ అన్నయ్య వచ్చేశారు.

రమణ : (సీతకు సంచీ అందించి) ఏమ్మా శోభా! ఇన్నాళ్ళకు మేము గుర్తుకు వచ్చామా, మీ ఆయన కనబడ్డాడు. హడావిడిగా వెళ్ళిపోతున్నానని చెప్పాడు. మిమ్మల్నయినా పంపించాడు. అదే సంతోషం బావఅన్నాను. సీతా! మీ వదిన వచ్చిందిగా, ఏమేం ఫలహారాలు చేస్తావో!

శోభ : మాకిప్పుడు ఏమీవద్దమ్మా! ఇప్పుడే కదా పీకలదాకా పెళ్ళివారింట్లో భోంచేశాము!

రమణ : పోనీలేమ్మా! మీపేరు చెప్పి నాకైనా నోట్లో ఏదైనా పడేస్తుందేమోనని!

సీత : నాలుగు బజ్జీలు, పకోడీలు నిముషంలో చేసేస్తాను. మీ భోజనం ఇంకా అరిగిపోక కూర్చుందావదినా? ఐనా, మీః న్నగారిది ఎప్పుడూ పరకడుపే, ఏం శ్రీకాంత్ నీకుపకోడీలు ఇష్టమేనా?

శ్రీకాంత్ : నేను బజ్జీలు, పకోడీలు బాగా చెయ్యగలనండీ! నాకసలు టిఫిన్లు చేయడం ఎంతో బాగావచ్చును.

రమణ : ఓయబ్బో! ఎలా చేస్తావేమిటి చెప్పు!

శ్రీకాంత్ : ఏముందండీ! పిండిన్నూ, నీళ్ళుకలిపి, ఆలుగడ్డలు పడేసి

వేయించెయ్యడమే!

రమణ :(నవ్వి) డౌనోయ్! అంతె! అంతే!

శోభ :పాపా! నీక్కూడా వచ్చునా వంటలు చెయ్యడం!

రూప :నాపేరు పాపకాదు అంటీ! రూప!

శ్రీకాంత్ :అంటీ కాదురూపా! అత్తయ్య! నేను బావని.

రూప :ఛీ! నాకు బావల్లేరని చెప్పలేదూ!

సీత :తప్పమ్మా! అలా అనకూడదు. కలుపుకుంటేనే కదాబంధుత్వాలు! ఉండండి టిఫిను చేస్తాను (అని లోపలకు వెడుతుంది)

శోభ :(చుట్టూచూస్తూ) అన్నయ్యా! మీరీ ఇట్లుకొని ఐదేళ్ళు కాలేదూ!

రమణ :అంతే, అయింది. ఏదీ, సున్నాలూ అవీవేయించాలి ఈ సంక్రాంతికైనా,

శ్రీకాంత్ :సున్నాలు వేయడం చాలా తేలికండీ! నాకువచ్చు, పెద్ద బక్కెట్టు తీసుకోవాలండీ ముందుగా, సున్నం బస్తాలు అమ్ముతారుగా! ఒకబస్తా గుమ్మరించి, అందులో నీళ్ళుపోసి కలిపేయాలి.

రూప :ఓహో! బజ్జీల పిండి మాదిరిగా కలుపుకోవాలా!

శ్రీకాంత్ :ఛీ! సున్నంతో ఎవరేనా బజ్జీలు చేస్తారేమిటి! బజ్జీల పిండిగట్టిగా కలపాలి. సున్నం పలచగా కలపాలి మామయ్యగారూ!

రూప :మామయ్యగారేమిటి? అంకుల్ అనాలి. నువ్వు ఇంగ్లీషు మీడియంలో చదవడం లేదా!

శ్రీకాంత్ :నేను ఏదో చెబుతోంటే మాటకి అడ్డువస్తావేమిటి పాపా!

రూపా :నాపేరు పాపకాదు, రూప అని చెప్పలేదూ!

శ్రీకాంత్ :ఏదో ఒకటిలే గానీ, సున్నం కలిపివేసేశాక, ఒకరోజుఆగి, తలుపులకి వార్నీషురంగులు వేసేయాలండీ! పెద్ద బ్రష్ వుంటుంది. పచ్చరంగు, నీలిరంగు విడివిడిగా కలిపివేసి,

రెండుసార్లు కోటింగులు ఇచ్చేయాలండీ! అవన్నీనాకు వచ్చు.

రమణ :ఏమిటమ్మాయి! మీవాడికి బాగా ట్రెయినింగ్ ఇచ్చినట్టు న్నావ్!

శోభ :నేనిచ్చేదేమిటి? అన్నిపనులు వాడికే వచ్చును. పోస్టాఫీసుకి వెడతాడు. బ్యాంకుకి వెడతాడు. బజారుకీ, బట్టలు దుకాణానికీ అన్నిటికీ తనే వెడతాడు.

రమణ :బాగుందే! బ్యాంకుకి వెళ్ళి ఏంతెస్తావు? అసలు అక్కడ ఏంచేస్తావు వెళ్ళి? చెప్పు, చెప్పు శ్రీకాంత్!

శ్రీకాంత్ :బ్యాంకులో ఏముంటాయి మామయ్యాగారు! డబ్బులేగా! పచ్చకాగితం రాసిస్తే డబ్బువేసుకుంటారు. నీలంకాగితం రాసిస్తే డబ్బుఇస్తారు. నాకు అసలు బ్యాంకులో పనిచెయ్యటం కూడవచ్చు. పోస్టాఫీసులో స్టాంపులు ధన్ధన్మని కొట్టాలి. స్టాంపులు అడిగినవాళ్ళని 'చిల్లరుందా!' అనిఅడిగి, చిల్లరయిస్తేనే స్టాంపులు, కవర్లు ఇవ్వాలి. నాకు పోస్టాఫీసులో పనిచేయటం బాగావచ్చును.

శోభ :పాపా! నీకుకూడా అన్నిపనులు వచ్చా!

రూప :నాపేరు పాప కాదు ఆంటీ, రూప!

శ్రీకాంత్ :ఆంటీ కాదు రూపా! అత్తయ్యా! నేను బావని.... అది సరే బ్యాంకులో దొంగల్ని పట్టడం నీకువచ్చా? నాకు భలేగా వచ్చు,

రూప :నేను దొంగలవెంట పరుగెత్తలేను. బాబోయ్! వాళ్ళ దగ్గర తుపాకులు, బాకులు వుంటాయి.

శ్రీకాంత్ :దొంగలకు కావలసినన్ని నోట్లుంటాయానీదగ్గర! దొంగల్ని ఎలాపట్టాలంటే మామయ్యగారూ! నేను చెబుతానండీ, "అదిగో మీనోటుపడి పోయింది. చూసుకోండి" అని ఎవరైనా అన్నారంటే, ఖచ్చితంగా వాళ్ళు దొంగలే. అలా మనదృష్టిని మళ్ళించి, చేతిలో సూటుకేసు లాగేస్తారు. లక్షలరూపాయులుంటాయిగా మనసూటుకేసులో! అందుకు!

సీత :(వస్తుంది టిఫిను, మంచినీళ్ళు తీసుకుని) ఏమిటోయ్! భలే

కబుర్లు చెప్పేస్తున్నావ్? టిఫిను తీసుకోవదినా! రూపా! జడవేస్తానురా. గులాబీలు కోయమంటే కోశావుగాదు. చీకటిపడిపోతే మొక్కల్లోకి వెళ్ళడం కష్టం, అత్తయ్యకు ఒక పువ్వు ఇద్దువుగాని.

శోభ : మొక్కలు, అవిబాగా పెట్టినట్టున్నారే! తోటపెంపకం అంతా ఎవరిది?

రమణ : ఇంకెవరు? నేనున్నానుగా - అన్నిచాకిరీలకి!

శ్రీకాంత్ : తోటపని చాలా తేలికండీ! గొయ్యి తవ్వేసి, విత్తనాలు పడేసి రెండు బక్కెట్లు నీళ్ళుపోస్తే, మర్నాటి కల్లా ఇంతిత మొక్కలు వచ్చేస్తాయి. నేను అన్నికాయలూ కోసేస్తాను చెట్టెక్కి, నేరేడు కాయలు, జామకాయలు, కొబ్బరికాయలు...

రూప : కొబ్బరిచెట్టు ఎక్కుతావా? పడిపోవూ?

శ్రీకాంత్ : నాకొచ్చు. కాళ్ళతో గట్టిగా పట్టేసుకుంటూ ఎక్కేయడమే! పైకిఎక్కాక కాయలు ఒకచేత్తోతుంపి కింద పడేస్తూండాలి. మరోవైపు, కింద ఎవరైనా వున్నారేమోనని బాగా చూస్తూండాలి. కింద ఎవరైనా వుంటే కాయలు పడి, బుర్రబద్దలైపోతుంది.

రూప : బద్దలైతే నీకు కట్టు కట్టడం కూడ వచ్చునేమోగా!

శ్రీకాంత్ : నాకువచ్చు. తలబాగా కడిగి, తుడిచేసి, మందు పట్టించేయాలి. బ్యాండేజీ. తలపాగాలాగా, ఇలా ఇలా చుట్టేసేయాలి. కన్నుమాత్రం కనబడేటట్టు ఖాళీవుండాలి.

రూప : నువ్వు అప్పుడు కొబ్బరి చెట్టు మీదవుంటావుగా, బ్యాండేజీ ఎలాకడతావు?

శ్రీకాంత్ : అక్కణ్ణించే కట్టెయొచ్చు, కిందికి దిగాక నైనా కట్టెయ్యొచ్చును.

సీత : మీవాడు భలేవాడేనే! అన్నీవచ్చునంటాడు. రానిదంటూ ఏమిలేదా? చిన్నిపిల్లాడివికదా! నీకు ఆడుకోవడంరాదా?

శ్రీకాంత్ : వచ్చు అత్తయ్యా! ఆటలన్నీ బాగా వచ్చు. ఆటలన్నీవచ్చు. వాలీబాల్, బాస్కెట్ బాల్, రింగ్ టెన్నిసు, టేబిలు

టెన్నిసు, క్రికెట్, హాకీ.

రూప :ఓహోహో! ఇంకేం! ఒలింపిక్ పోటీలకు వేళ్ళే ఛాంపియన్!

శ్రీకాంత్ :చూద్దాంపద! బైట చూపిస్తాను. ఒక్కసారి పరిగెత్తా నంటే, నేల అదిరిపోవాలి.

సీత :కాసేపు బైట ఆడుకోండర్రా. మేం మాట్లాడుకుంటూ వుంటాము. ( పిల్లలిద్దరూ బయట వేపుకి వెడతారు)

ఈకాలం పిల్లలతో చాలా కష్టం వదినా! మనం ఒకటి అంటే వాళ్ళు పదిచెప్తారు. మా రూప చూడు. దానికి ఏపనీరాదంటుంది.

రమణ :నిజంగానేరాదు శోభా! చిన్నపిల్ల. దానికి ఆపనీ, ఈ పనీ చెప్తే ఏంచేస్తుంది!

సీత :మీరుమరీఅన్యాయం - దాని వయస్సుకి- నేను గిన్నెడు అత్తెసరువండి, అప్పడాలు కాల్చి, పదిమందికి భోజనం వడ్డించేదాన్ని మా రూపని నీదగ్గరికి పంపిస్తే, అన్నిపనులు నేర్చుకుని వస్తుందేమోవదినా!

శోభ :తప్పకుండా మా శ్రీకాంత్ కి ప్రపంచంలో రానిదంటూ లేదు. ఎలక్ట్రికల్ సామాన్లన్నీ విప్పిపెడతాడు.... మా సీలింగుఫాను ఎప్పుడూ నేలమీదే వుంటుంది. రేడియో సామాన్లన్నీ ఒక బుట్టలో వుంటాయి స్కూటరయితే చెప్పనే అక్కర్లేదు.
(బయట నుండి మోటార్ సైకిలు చప్పుడు
ఢామ్మని పడిన చప్పుడు, కేకలు)

శ్రీకాంత్ :(ఏడుస్తూ) అమ్మా! అమ్మా! ఓ అమ్మోయ్! బాబోయ్! చచ్చి పోయాన్రోయ్! (కాలు పట్టుకుని కుంటుతూవస్తాడు)

శోభ :అయ్యో! అయ్యో! ఏమైందినాన్నా!

రూప :(శ్రీకాంత్ ని పట్టుకుని వస్తూ) అక్కడ నాన్నగారి స్కూటరుంటే నాకు నడపడం వచ్చని తిప్పేశాడు. అదివెళ్ళి గోడకికొట్టుకుని పడిపోయింది.

రమణ :(లేచినిలబడి) అయ్యో! స్టార్ట్ చేశాడా! కిందపడిపో యిందా? కిందేపడివుందా!

రూప :లేదు. నేను తాళం చెవులు ముందె తీసేశాను. స్టాండు మాత్రంతీసి, తోశాడు. నేనే కష్టపడి పైకెత్తి పెట్టేశాను. (శ్రీకాంత్ ఏడుస్తూనేవుంటాడు)

శోభ :ఎక్కడ దెబ్బ తగిలిందిరా నాయనా? అయినా అలా ఎలా పడేసుకున్నావురా? (సీత నీళ్ళు, బట్ట తెచ్చి ఇస్తుంది)

రూప :అంతకు ముందేమో, అక్కడ పక్కింటిగోడ, మేస్త్రీలు కడుతోంటే, నాకుకూడావచ్చు -అంటూ ఇటుకలు ఎత్తి కాళ్ళమీద పడేసుకున్నాడు.

శోభ :అయ్యయ్యో! ఎంతదెబ్బతగిలిందో! (శ్రీకాంత్ మూలుగుతున్నా వినిపించుకోక, బట్ట తడిపి తుడుస్తూంటుంది.)

రూప :తగిలింది ఆంటీ! కాని ఏదో వచ్చేస్తున్నట్టు నటిస్తూ, కళ్ళు తుడుచుకున్నాడు. అలాగ అక్కడ నాన్నగారి స్కూటరు కనిపించింది. పరుగెత్తుకుంటూ వెళ్ళి - నాకు నడపటం వచ్చు- అని స్టాండు ఎత్తి నడపబోయి, గోడకి పెట్టేశాడు.

రమణ :ఏమిటిరాబాబూ! చిన్నపిల్లలకి గోడలు కట్టడం, స్కూటర్లు నడపడం వస్తుందా! అయినాశోభా! పిల్లలకి వచ్చిన పన్లేమిటో, రానివేమిటో మనం చూసుకోవాలి గాని.

సీత :ఏమీరాదనే మాచిట్టి తల్లి తమాషాగా, అన్నిపనులూ చురుగ్గా చేస్తోంది. ఎంతో సమయస్ఫూర్తితో స్కూటరు ఎలా ఎత్తిపెట్టిందో! శ్రీకాంత్ని వదిలేసి, తనూ ఏడుస్తురాకుండా, జాగ్రత్తగా తీసుకొచ్చింది కదా!

శోభ :అన్నీ వచ్చుఅనే మావాడు, పోజుకొట్టబోయి, ఏమిచేతకాక, ప్రమాదంలో పడ్డాడు...ఏంనాన్నా! ఏడవకు, కాలికి కట్టుకడతాను.

రూప :మీరుండండి ఆంటీ! నేను కడతాను. కట్టుకట్టడం నాకు వచ్చు, (శ్రీకాంత్ లాగా అంటుంది ఈ చివరిమాట) ఏంశ్రీకాంత్! నీకు స్కూటరు నడపడం బాగావచ్చా?

శ్రీకాంత్ :(ఏడుస్తూ) అమ్మబాబోయ్! నాకురాదు.

రూప :పోనీ గోడకట్టడం వచ్చునా?

శ్రీకాంత్ :(ఏడుస్తూ) బాబోయ్! రాదు, అస్సలు రాదు.

రమణ :పోనీలే, ఏడవకు. ఇప్పటికైనా తెలిసిందా? చిన్నపనులు, పెద్దపనులు మనకి చేతకావు అని అనుకోకూడదు. నేర్చుకోనిదే ఏమిరాదు.

సీత :అల్లాగని మనకి ఏమిరాదు అని చేతులుముడుచుకుని కూర్చోకూడదు.

రమణ :అంటే మనకి వచ్చినవన్ని చక్కగా చెయ్యటం నేర్చుకోవాలి. అల్లరి జోలికి పోకుండా, అమ్మ, నాన్నకి సాయం చేయాలి. ఏమంటావు?

శ్రీకాంత్ :(దీనంగా) సరేనండీ! అమ్మా - నాకుదాహం

సీత :ఇదిగోబాబు నీళ్ళు.

శోభ :నేను తాగించనా! ఉండునాన్నా!

రూప :నీకు తాగటం వచ్చా!

శ్రీకాంత్ :అమ్మా! నువ్వు తాగించమ్మా! నాకురాదు.

రమణ :(నవ్వేసి) పోవోయ్! అంతాపోజు ! నీకన్నీమంచి నీళ్ళుప్రాయమే!

0 0 0

# కనుపించుటలేదు-రత్నమాణిక్యాలు

పిల్లలకి కొన్ని కోరికలుంటాయి. అవి కొన్నిసార్లు పెద్దవారికి అర్థం కావు అట్లాంటప్పుడు పిల్లలు యిల్లు విడచి పారిపోవచ్చును. పిల్లలు కూడా తాము మసలే సమాజంలో, తోటివారి మధ్య గౌరవం కోసం, మంచి పని ఏదైనా చేద్దామనుకుంటే, తల్లిదండ్రులు ఆమోదించి, ప్రోత్సహించి చెప్పే నాటిక హాస్యధోరణిలో సాగుతుంది.

పాత్రలు :

| | |
|---|---|
| సబ్ ఇన్స్పెక్టర్ | మాణిక్యం |
| కానిస్టేబుల్ | ఆమె తల్లి |
| వెంకటరత్నం | హెడ్ మాష్టర్ |
| అతని తండ్రి | హెడ్ మిస్ట్రెస్. |

(రోడ్డుమీద ఒక సబిన స్పెక్టర్ నిలబడి ఉంటాడు. ఒకాయన హడావుడిగా ఎడంవేపు నుంచి వచ్చి స్టేజి మీదా, అడియన్స్ లోకి అన్ని వేపులకీ వెతుకుతూ చూసి కుడివైపుకి వెళ్ళి పోతాడు. సబినస్పెక్టర్ ఈలవేస్తాడు. ఒక కానిస్టేబుల్ వచ్చి సెల్యూట్ చేసి నిలబడతాడు.)

సబ్ :వీయ్ ఒన్నాట్ ఎలెవెన్..... అదుగో, ఆ పెద్ద మనిషిని చూశావా? ఆయన ఏం వెతుకుతున్నాడు?

కాన్ :(ఒక్క క్షణం లోపలికి వెళ్ళొచ్చి) ఒక రత్నం కన్పించడం లేదుట సార్.

సబ్ :రత్నమా?

కాన్ :ఎస్సార్! రత్నం! జెమ్!

(ఈలోగా కుడివైపునుంచి ఒకావిడ వచ్చి స్టేజిమీద అడియన్స్ లోకి చూస్తూ వెతుకుతూ ఎడంవేపుకి వెళుతుంది. పోలీసు లిద్దరూ ఆమెవైపు చూస్తారు.)

కాన్ :సార్! ఇటు వెళ్ళిందే ఈవిడగారేం వెతుకుతున్నారో కనుక్కోమంటారాండీ?

సబ్ :ఇంకా చూస్తావేం? వెళ్ళి కనుక్కోరా? ఏం వెతుకుతున్నారో.

కాన్ :(కోపనికెళ్ళి ఒక్క క్షణం తర్వాతవచ్చి) ఒక మాణిక్యం కనబడ్డంలేదుట సార్.

సబ్ :మాణిక్యమా?

కాన్ :యస్సార్.....మాణిక్యం...మెరూన్....మెరుస్తుంటుందే.... అదే.....

సబ్ :అరే! చిత్రంగా ఉందే......పద, ఇన్వెస్టిగేట్ చేయాలి!

(అనౌన్స్‌మెంట్ - కన్పించుటలేదు. రత్నమాణిక్యాలు. తెర లేస్తుంది. సబ్ ఇన్‌స్పెక్టర్ కూర్చొని ఉంటాడు. బల్ల దగ్గర ఇద్దరు పిల్లలు - ఒన్నాట్ ఎలెవన్ పోలీసు నిలబడిఉంటాడు. x

సబ్ :ఊ....అయితే. అర్ధరాత్రివేళ సికింద్రాబాద్ రైల్వే స్టేషన్‌లో నువ్వేం చేస్తున్నావంటే మాట్లాడవేం అబ్బాయి? పోనీ. పాపా నువ్వు గౌలిగూడ బస్‌స్టాప్‌లో రాత్రి 11గంటలకి వంట

రిగా ఎందుకున్నావంటే చెప్పవేం? హు.... ఎన్నిసార్లడిగినా మీరిద్దరూ చెప్పరు.... (హఠాత్తుగా ఉపన్యాస ధోరణిలో) నేటి బాలలే రేపటి పౌరులు - మీమీదే భవిష్యత్తు ఆధారపడి ఉంది. మీబాగే దేశం బాగు, దేశం బాగుంటే ప్రపంచం బాగుంటుంది (అని విళ్లిద్దరి వంకా చూస్తాడు) ఏమిటి? మీరేమి చెప్పక పోతే నేను కేసు ఇన్వెష్టిగేట్ చేయడం ఎలాగ?

కాన్ :చెప్పు బాబూ!తల్లీనువ్వైనా చెప్పమ్మా!

ఇన్వెష్టిగేషన్ మరి కష్టమయిపోతే మరి కష్టం..... .

బాబు:ఎలా మాట్లాడుతానండీ, నేను మూగవ్రతంలో ఉన్నానుగా.

సబ్:అలాగా! ఎప్పట్నించీ?

బాబు:మొన్నప్రొద్దున్న మానాన్నగారు బెల్లంకొట్టిన రాయిలా పల కవేం అన్నప్పట్నించండీ.

సబ్:'ఒహో. బావుంది. గానీ. - మీనాన్నగారెవరు?

బాబు:ఆ.... కబుర్లలో పెట్టి నాదగ్గర్నుంచి అన్నీ తెలుసుకుందా మానా? ఆ పప్పే ఏం ఉడకవండీ.

కాన్:ఏమిటబ్బాయి ఈయన సబ్ ఇన్స్పెక్టర్ గారు గౌరవంగా మాట్లాడాలి.

సబ్:పాపా! నువ్వు ఒక్క గుక్కెడే అయినా తాగావు కాదు ఎలామరి?

పాప:ఎట్లా తాగుతానండీ నేను నిరాహారదీక్షలో ఉన్నాను కదా!

సబ్:అలాగా ఎప్పటినుంచీ

పాప:నిన్న పొద్దున్న మా అమ్మ 'పిండిమరలా ఎప్పుడూ నోరు ఆడిస్తుంటావేం. అని కేకలేసినప్పట్నించండీ.

సబ్:ఆహా... చాలా బావుందికానీ, మీఅమ్మగారి పేరేమిటి?

పాప:అమ్మా ఆశ. నేను అడ్రెస్ చెబితే నేను ఆమరణ నిరాహారదీక్ష చేస్తున్నానని మావాళ్లకి చెప్పడానికా?

కాన్:ఏమిటమ్మా...ఆయన సబిన్స్పెక్టర్ గారు... మీరు సరిగ్గా

చెప్పకపోతే, ఇన్వెష్టిగేషన్ చేయడం బాలజాతికి నష్టమండీ.

పాప:నావ్రతాన్నిపాడుతేస్తే. అంతర్జాతీయబాలలకే తలవంపులండీ.

కాన్:సార్... సార్... రేడియో పెట్టండి.

(అనౌన్స్‌మెంట్: ఆకాశవాణి. ముఖ్యప్రకటన. కన్పించుటలేదు. వెంకటరత్నం అనే అబ్బాయి మొన్న ఉదయం ఇంట్లోంచి వెళ్లిపోయేడు. ఎర్రగా బుర్రగా ఉంటాడు. ఆచూకి తెలిపివారికి వెయ్యిరూపాయలు బహుమతి. తండ్రి చిరునామా.... (అంటూండగా రత్నం రేడియో పట్టుకుని పరుగెత్తుతాడు. గదంతా ఒక రౌండ్ కొట్టాక కానిస్టేబుల్‌కి దొరుకుతాడు.రేడియో మళ్లీ బల్లమీదపెట్టేటప్పటికే... మరొకప్రకటన... తప్పిపోయినది మా అమ్మాయి మాణిక్యవల్లి. వయసు 10ఏళ్ళు ఎర్రగా చక్కగా ఉంటుంది. మంచిమాటకారి. జాడతెలిపినవారికి 500 రూపాయల బహుమతి... అంటుండగానే గబుక్కున మాణిక్యం ముల్లుతిప్పేస్తుంది.మళ్లీ సరిగ్గా పెట్టేటప్పటికి... ప్రకటనలు సమాప్తం. తర్వాత కార్యక్రమం కొద్దిక్షణాలలో వింటారు... అని వస్తుంది.)

సబ్:ఏయ్ పిల్లలూ ఏమిటి మీ అల్లరి? మీరిద్దరే అన్నమాట ఈ రేడియోలో చెప్పిన వెంకటరత్నం, మాణిక్యవల్లిను.

కాన్:ఎస్సార్... కనుపించని రత్నం. మాణిక్యం- తల్లి. తండ్రి అర్థమైందికదూ సార్! నేను వెళ్లి పాపం వాళ్లిద్దరూ ఇందాక రోడ్డుమీద కనిపించారే, వాళ్లిద్దరు ఎక్కడున్నారో వెతికి....

సబ్:వద్దువద్దు...నువ్వూ కన్పించకుండా పోతావ్!

పాప:అప్పుడు మిమ్మల్ని గురించి రేడియోలో కన్పించుటలేదు కాన్‌స్టేబుల్ గారు'అని చెప్పాల్సివస్తుందండీ!

సబ్:నువ్వు చాలమాటకారివే. రేడియోస్టేషన్‌కి ఫోన్‌చేసి ఇప్పుడే మీ చిరునామాలు కనుక్కుంటాను. మిమ్మల్ని జాగ్రత్తగా మీ తల్లిదండ్రులకు అప్పగించండం మావిధి.

పాప:మీరు ఆపనిచేస్తే ఇక్కడే నిరాహారదీక్షతీవ్రతరం చేసేస్తాను. సత్యాగ్రహం చేస్తాను.

సబ్:(ఆలోచించి) పోసీ ఒన్నాట్ ఎలెవెన్... నువ్వు అలా వెళ్లి

వీళ్ల తల్లినీ, తండ్రినీ, వెతుకుతావా?

కాన్: (రెండడుగులు వేసి, వెనక్కి తిరిగి) సార్... వాళ్లని కనుక్కున్నవారికి కూడ బహుమతి ఉంటుందాండీ? (సబ్ ఇనస్పెక్టర్ ఉరిమి చూస్తాడు.) అహ... లేదా పొన్లెండి. (వెడతాడు)

బాబు: సార్... ఈ మాట చెప్పండి.. మీరు మాబాలల మిత్రువా? శత్రువా? సూటిగా నా వంక చూసి నిజం చెప్పండి.

సబ్: నేను...నేను మీ ఫ్రెండ్ నే.

బాబు: ఐతే నన్ను మావాళ్లకి అప్పగించాలన్నమాట మానేయండి. మరలా చేస్తే. నేను మీ ఇన్వెష్టిగేషన్ కి బోలెడు క్లూలు ఇస్తాను. లేకపోతే నేను వెనకాలున్న అసలు కటకటాల్లోకి వెళ్లి, తాళం పెట్టేసుకుని ఘోరంగా ప్రారంభిస్తాను. ప్రహ్లాదుడు, ధృవుడు, మార్కండేయుడూ అలా! వచ్చినా తాళం తీయను. ఆ... మీరెంతమంది దొంగల్ని పట్టుకొచ్చినా తీయను.

పాప: నేను కూడ ఆ కటకటాల వెనక మరో మూల నిరాహారదీక్షా. తపస్సూ కూడ చేస్తాను.... ఆ... మీరెంత మంది పోలీసుల్ని పట్టుకొచ్చినా తీయను.

(లోపల్నించి బాబూ వెంకటరత్నం, తల్లి మాణిక్యవల్లి అని పెద్దగా పిలుపులు.)

బాబు: అదుగో మానాన్నగారు వస్తున్నారు. మీరు మాకు ఫ్రెండు. మీరు వాళ్లిద్దర్నీ ఏదో ఒకటిచెప్పి సర్దిపంపించేయండి. తర్వాత మీకు బోలెడు క్లూలిస్తాను.

పాప: అదుగో మా అమ్మ. మీరు మా మాట వినకపోయారో చాల ఇబ్బందుల్లో పడతారు... మీ ఇన్వెష్టిగేషన్ కష్టమైపోతే మరి కష్టం... వస్తున్నారు వాళ్లు. చెప్పొద్దు ప్లీజ్.... మీరు చెప్పేరంటే మీమీద ఒట్టే. (లోపలికి వెళ్లిపోతారు)

కాన్: రండి... మీరు చెప్పిన అబ్బాయి (తల్లివైపు తిరిగి) అమ్మా మీరు చెప్పిన అమ్మాయి మా పోలీస్ స్టేషన్ కొచ్చేవరకే రేడియోలో విన్నాంకదండీ... మా ఎస్సైగారు అప్పుడే కేసు పట్టేసుకున్నారండీ! మరేమో ఈ పిల్లలిద్దరూ (అని

అటు చూసేటప్పటికి ఎస్సై తలపట్టుకుంటాడు.)

కాన్ :అదేమిటిసార్! తలపట్టుకున్నారు... పిల్లలు ఏరిసార్?

సబ్ :(తెప్పరిల్లి) ఏ పిల్లలు?

కాన్ :మనపిల్లలండీ - అదే మనకి దొరికినపిల్లలండీ.

సబ్ :మనకి దొరికారా? ఎక్కడ? ఎవరు? ఏయ్ ఒన్నాటీ ఎలెవన్? కలగంటున్నావా?

తండ్రి :అదికాదు ఎస్సైగారూ! మా అబ్బాయి మొన్న పొద్దుట్నుంచీ కనబడ్డంలేదు .... స్కూల్ కి వెళ్లి ఇంకా తిరిగిరాలేదు. స్కూల్ హెడ్ మిస్ట్రెస్‌గారు తనకి తెలియదంటారు.మా ఆవిడేమో అన్నపానాదులు... అంటే .. అదే... పాన్, తమలకులతో సహా మానేసింది.

సబ్:మీ అబ్బాయి చదివే స్కూల్ పేరేమిటి? ఫోన్ నంబరు

తండ్రి :ఐదేళ్లండీ.

సబ్:అబ్బా! వయసుకాదండీ ఫోన్ నంబరు.

తండ్రి :అదేనండీ!ఐదేళ్లు?????.

సబ్ :(డయల్ చేసి) హెడ్ మిస్ట్రెస్‌గారు ఉన్నారా? నమస్కారం మేడమ్ ! ఈ టైమ్‌లో కూడా మీరు స్కూలులో ఉండటం మా అదృష్టం. అమిడ్ నగర్ పోలీస్ స్టేషన్ కి అర్జెంటుగా రావాలిమీరు. ఒక కేసుగురించి మీ సహాయం కావాలి. వచ్చేయండి మేడం. (ఫోన్ పెట్టేస్తాడు.)

సబ్ :(అవిడ్నెందుకండీ పిలుస్తున్నారు? నాకసలే భయం...) ఆవిడ్ని చూసే... మా అబ్బాయి ఎప్పుడు కాస్త లేట్‌గా వెళ్లినా నావైపు గుడ్లురిమి చూస్తారావిడ... కారు డోర్ కాలిపో తుందేమోనని భయం వేస్తుంది. అసలు ఓసారి కాలిందట కూడా.. మా ఆవిడ అంటుంది.

కాన్ :అలాంటప్పుడు ఫైర్ సర్వీస్‌వాళ్లని పిలవాలి సార్ మనపిల్లలంటే..... అదే మనకి దొరికిన పిల్లలు ఏరండీ?

సబ్ :ఏ పిల్లలు? ఎవరికి? ఎక్కడ?

తల్లి :మా అమ్మాయి మాణిక్యవల్లి కూడ మొన్నపొద్దుట్నుంచీ

కనబడ్డంలేదు... మావారేమో అసలు ముందునుంచీ దాని మాటకాదనటమే. తీరా మొన్న పొద్దున్న పార్టీ మార్చేసి. దానిపక్షం మాట్లాడటంతో నేనే వల్ల కాదన్నాను. మా అమ్మాయి స్కూల్ హెడ్‌మాష్టర్‌గారు తనకి పిల్ల సంగతి ఏమీ తెలియదంటున్నారు.

సబ్ :ఏ స్కూల్? ఫోన్ నంబర్?

తల్లి:ఏడేళ్లండీ.

సబ్:అబ్బా! వయసుకాదండీ - నేనడిగింది స్కూల్‌ఫోన్‌నంబర్.

తల్లి:అదేనండీ.... ఏడేళ్లు....???????

సబ్:(డయల్ చేసి) నేను అమిడ్‌నగర్ పోలీస్ స్టేషన్‌నుండి మాట్లాడుతున్నానండీ. ఒక కేస్ ఇన్‌వెష్టిగేషన్ విషయం. వెంటనే రావాలండీ... ప్లీజ్.రండి. మీరీ టైమ్‌లో దొరకడం మా భాగ్యం.

తల్లి:హెడ్ మాష్టర్‌గార్ని రమ్మన్నారా? మంచిపనిచేశారు...రా నీండి ఆయన పనిచెబుతాను.

సబ్:ఆయన పనిచెబుతారా? అహింసే మా పరమధర్మం... మీరు అయన పని ఇక్కడ చెప్పడానికి వీల్లేదు.

తల్లి :ఆయన సంగతి మీకేం తెలుసు? ఎప్పుడు పంపమన్నా మా పిల్లని ఇంటికి పంపరు. బ్యాంకులోని డబ్బులా బైటకిరానివ్వరు.

కాన్ :అప్పుడు రిజర్‌బ్యాంక్ వాళ్లని పిలవాలండి....సార్, మన పిల్లలు, అదే మనకి దొరికిన పిల్లలు ఏరి?

సబ్ :ఏపిల్లలు? ఎవరికి దొరికేరు? ఎక్కడ?

(హెడ్‌మిస్ట్రెస్‌గారు గొడుగుతో సహావచ్చి, అది మడుస్తూ తండ్రికి కాస్త తగిలిస్తుంది.)

సబ్ :కూర్చోండి మేడం.....కూర్చోండి....వీళ్ళ అబ్బాయి మీకు తెలుసుగా! .... వెంకటరత్నం......

హె.మ :ఔనండి... నిన్న రాలేదు బడికి. లేటుగా వచ్చిన పిల్లల వరుసలలో లేడు. టైముకి వచ్చేడేమో రోజంతా వానొస్తుంది

అని భయపడ్డాం.... వేర్ ఈజ్ యువర్ సన్ (గట్టిగా అరుస్తుంది)

తండ్రి : లే.... లేటు కాలేదండి.... టైముకి తప్పిపోయేడు.

హె.మ : ఏమిటో మీరెప్పుడూ కుంటెసాకులే చెబుతారు.

సబ్ : వెంకటరత్నం కనబడ్డంలేదండి. ఇందాక రేడియోలో చెప్పేరు. మీరు వినలేదా?

హె. మ : అరే, ఎంచేత? నాకు తెలియదే? (గట్టిగా వేర్-ఈజ్ యువర్ సన్?)

తండ్రి : ఏమోనండీ! వారం నుండి నాతో మాట్లాడడంలేదు. నేనో పార్టీ, వాళ్ళమ్మ ఒకపార్టీ, వాడొకపార్టీ...దీంతో ఇంట్లో గంద రగోళం. పోనీ, నేనూ పార్టీ మార్చేసి , వాడిపక్షం ఉందామని మనస్సు పీకిందికాని వెయ్యిరూపాయిలు ఖర్చవు తుందని అంతరాత్మ అరచిందండి!

హె.మ : మీరూ, మీ అబ్బాయి ఒకపార్టీ కావాలంటే వెయ్యి రూపా యల ఖర్చా! ఓహో, నాకర్థమైందిలెండి ఎన్నెగారూ! నన్ను మీరు పిలవడం మంచిపనే అయింది. స్కూల్లో మంచినీళ్లతొట్టి కట్టిస్తున్నాం. దాని ఖర్చుమూడు, నాలుగువేలు అవుతుందనీ పిల్లల్ని అడిగేం. మీ అమ్మా నాన్నకి చెప్పి తోచిన సొమ్ము తీసుకురండని ఎవరెవరు డబ్బు పట్టుకొస్తారని అసెంబ్లీకి తెస్తానని అన్నాడు. మేం నమ్మలేదు. బెట్స్‌న్నారుట అతని ఫ్రండ్స్.

తండ్రి : ఏంతేలింది? మా అబ్బాయి దొరకండే?

కాన్ : దొరికినా ఖర్చేగదండీ, బహుమతి ఇచ్చుకోవాలిగా! దొరక్కపో వడమే మంచిదండీ! సార్ మనపిల్లలు అదే మనకి దొరికిన పిల్లలు, ఏరిసార్!

సబ్ : ఏపిల్లలు? ఎవరికి దొరికేరు? ఎక్కడ?

(ఇంతకు హెడ్‌మాష్టరు హడావుడిగా వచ్చి తల్లిని చూసి వెనక్కి తగ్గుతాడు.)

తల్లి : ఆ.....ఆ.....రండి...మా అమ్మాయి మాణిక్యవల్లి ఏమైం దంటే చెప్పరేం

హె.మా :చెబుతానండి...చెబుతాను....ఇప్పుడే...మీ అమ్మాయి మాణిక్యవల్లి కదూ! మాబడికి వస్తే బ్యాంక్ లాకర్‌లోలాగ భద్రంగా ఉంటుంది. నాకు తెలియదండి. మీ అమ్మాయి ఎక్కడకెళ్లిందో!

సబ్ :కూర్చోండి సార్! ఆ అమ్మాయిని మీ బ్యాంక్‌లో - సారీ...మీ స్కూల్లో చివరిసారి ఎప్పుడు చూశారు? అసలు బళ్లోంచి ఇంట్లోంచి రెండు రోజులు కనిపించకుండాపోయే పరిస్థితి ఎందుకు వచ్చింది అనీ?

హె.మా :ఏమోనండి.....నాకేం తెలుస్తుంది? మాణిక్యవల్లి నిజంగా మాణిక్యంలాటిపిల్లండీ! సానబట్టకుండానే ప్రకాశిస్తుంది. మనం భద్రంగా బ్యాంక్‌లో ఫిక్సెడ్ డిపాజిట్టులాగా కాపాడుకోవాలి. అలా చేయకపోతే తప్పు.

తల్లి :ఎవరిది తప్పు? (రెట్టించి) ఎవరిది?

హె.మా :నాదే....నాదేనండీ తప్పు! ....ఈమధ్య మాస్కూల్లో పిల్లల బ్యాంక్ ప్రారంభించేం....

తల్లి :ఆ.... ఆ- పిల్లల బ్యాంక్.... మా మాణిక్యాన్ని వీధిపాలు చేసింది అదేగా! ఐతేనూ, చిన్న పిల్లల్ని వందలకి వందలు రూపాయలు తెమ్మని చెబుతారుటండీ హెడ్‌మాస్టరుగారూ?

హె. మా :రామరా... నేనెక్కడ చెప్పాను తల్లీ... మీ అమ్మాయే అన్నదికద, ఐదువందల రూపాయలు తెచ్చి వంచాయికా పిల్లలబ్యాంక్‌లో డిపాజిట్ చేస్తానని...

కాన్ :సంచి ఏవిటండి హెడ్‌మిష్టరుగారూ?

తల్లి :మీరుండండీ కాన్‌స్టేబుల్‌గారూ! అసలేం జరిగిందంటే వారం రోజులనాడు మాఅమ్మాయివచ్చి అమ్మా మాస్కూల్లో పిల్లలబ్యాంక్ తెరిచేరు... పిల్లలే బ్యాంక్ నడిపిస్తారుట. నేను ఐదువందలరూపాయలు డిపాజిట్ చేస్తాను ఇమ్మని అడిగింది. నేనివ్వను పొమ్మన్నాను. వాళ్లనాన్నగారు ఆమాటే అన్నారు. కానీ... ఏంచేతనో మొన్న నాపార్టీనుంచి డిఫెక్టైపోయి దానివైపు వెళ్లిపోయి, పోనీ ఇచ్చెయమంటూ మొదలెట్టేరు. మాటంటే మాటే ముందువద్దని తీరా ఒప్పుకుంటే అలుసై పోతామని వద్దన్నాను. దాంతో ఇద్దరికీ దెబ్బలాట....దాంతో

ముగ్గురికి దెబ్బలాట....

తల్లి :అంతేనండి... మా మాణిక్యం కన్పించకుండాపోయింది.

కా :సార్! కేసుతేలిపోయింది. అబ్బా... ఈ టైమ్‌లలోగానీ మన పిల్లలు - అదే మనకి దొరికిన పిల్లలేగానీ ఉంటే గ్రూప్ ఫోటో ఎంత బాగా వస్తుందో!

తండ్రి :ఇందాకట్నించీ ఈయన దొరికిన పిల్లలంటారు. ఏరండీవాళ్లు?

సబ్ :అలాగే అంటుంటాడుగానీ! ఏమండీ చెప్పండి. మీరు బహుమానం ఎంత ఇస్తానన్నారు మీ అబ్బాయి దొరికితే?

తండ్రి :వెయ్యి రూపాయలు, ఇంకా ఎక్కువైనా ఇస్తానండీ. నిజంగా మా రత్నందొరికితే.

సబ్ :అమ్మా మీరు?

తల్లి :ఐదువందలు ఇస్తామండి. ఇంకా ఎక్కువైనా ఇచ్చేస్తామండి మా మాణిక్యం కంటబడితే.

సబ్ :ఆల్రైట్... ఎంతెంత ఇస్తారో, ఆ సొమ్ము ఇలా పెట్టండి.

హె.మి :అదేమిటి? లంచమా?

హె :గుడ్డు తేలవేసి లంచమె.

సబ్ :లంచమేననుకోండి. మరోటనుకోండి. పిల్లలు కావాలంటే ఇచ్చేయండి మరి.

హె.మి :అదేమిటి? బ్లాక్ మెయిలింగా?

హె.మా :గుడ్లు తేలవేసి బ్లాక్ మెయిలింగే?

తండ్రి :సరే తీసుకోండి. ఈ చెక్కు మీద వెయ్యిరూపాయలు వేసి సంతకం పెట్టి ఉంచేను. మీ పేరు రాశేసుకోండి. అని ఇస్తాడు

తల్లి :నోట్లు కట్టికట్టి బ్యాగులో పెట్టుకునే తిరుగుతున్నాడు. ఇస్తుంది

కాన్ :నాకర్థమైపోయిందిసార్. మరింక పిల్లలేరి? దొరికిన పిల్లలు? మళ్లీ కనిపించకుండా పోయేరా?

రత్నం, మాణిక్యం బయటికి వచ్చి సార్ మాదే అడబ్బు ఇవ్వండి.

సబ్ :మీదే తీసుకోండి.

తండ్రి :బాబూ రత్నం... నాయనా ఎక్కడికెళ్లిపోయేవు?

పాప :సారీ! మమ్మీ... ఎస్సైగారూ! హెచ్ యమ్‌గారూ! ఇదుగోండి ఈ రూపాయలు నా పేర సంచయికా బాంక్‌లో జమ కట్టండి.

తల్లి :ఆ .....ఆ.....ఏమిటల్లా డైరెక్ట్‌గా ఇచ్చేస్తున్నావ్?

పాప :తప్పేమిటమ్మా! మీకిష్టం వచ్చినట్లు మీరు ఐదువందలు బహూమతి ఇచ్చుకున్నారు. కానీ నా కిష్టం వచ్చినట్లు నేను దాచుకుంటే ఆ సొమ్ము ఎక్కడికిపోదు. పైగా వడ్డీవస్తుంది.

బాబు :సార్! ఆ చెక్కు ఇల్లా ఇవ్వండి... హెచ్ యమ్‌గారూ! దీని మీద మన స్కూలుపేరు రాసేయండి.

తండ్రి :ఆ....ఆ... ఏమిటూ ఇవ్వడం నన్ను అడగక్కర్లేదా?

బాబు :తప్పేమిటి నాన్నా! నీ పేరు మీదే డొనేషన్ ఉంటుంది. మీ చేత ఒక మంచిపని చేయించకూడదా నేను.

తండ్రి :అయితే మాత్రం ఏదిమంచో, ఏదిచెడో మీరేనేమిటి చెప్పడం?

పాప :ఏం మాకేమి తెలియదా? ఈ ఆస్తంతా నీదేనే తల్లి అంటుంది మమ్మీ ...మరి ఒక్క అయిదు వందలో, వెయ్యో ఖర్చుచేసే హక్కు మాకులేదా?

బాబు :మాకూ అవసరాలుంటాయి. నాన్నగారేమో ఏసంస్థ వారో వచ్చి అడిగితే పదివేలు ఇట్టే ఇచ్చేస్తారు. మరి తన పేరుననే ఓమంచి పనిచేస్తానంటే ఒప్పుకోరు. మాక్కూడా స్నేహితులందరితో పరువుంటుందిగా! మాకనీస కోర్కెలు కూడ తీర్చకపోతే ధర్నాలు, నిరాహారదీక్షలు, సమ్మెలుచేయాలి.

సబ్ :బాబూ! నీ పుణ్యమని..... ఈ పోలీస్ స్టేషన్ తగల బెట్టాలను సికోరిక తీరిందిగా.....

కాన్ :సార్ నేను రేడియోస్టేషన్ కెళ్ళి రత్నమాణిక్యాలు దొరికాయని చెప్పిరానాండి?

పాప :వద్దండీ . .. మీరు కనిపించకుండా పోతే ఎస్.ఐ గారి ఇన్వెస్టిగేషన్ కష్టమైపోతే మరీ కష్టం.
( అంతరూ నవ్వేస్తారు.)

# కనువిప్పు

ప్రతి సరుకులో కల్తీ వున్నదని మనం ఈనాడు బాధ పడుతున్నాము. కానీ కల్తీ చేసేవారు కూడా సమాజంలో సభ్యులే. తాము ఆ నేరం చేసి యితరులకు హాని, నష్టం కలిగించినట్లే, యితరులు కూడా తమకు బాధలు కలిగించవచ్చునని తెలుసుకోవాలి. ఆహారంలో కల్తీ చేయడం వల్ల ఎంత ప్రమాదమో, చిన్నతనంలోనే అర్థం చేసుకోవడానికి వుపయోగించే నాటిక యిది.

ఇందులో పాత్రలు

| | | |
|---|---|---|
| 1. యశోదమ్మ | - | పాలవ్యాపారి |
| 2. సునీత | - | ఆమె కూతురు |
| 3. లక్ష్మమ్మ | - | నూనె వ్యాపారం |
| 4. తిరుమలయ్య | - | ఆమె భర్త |
| 5. అమరేంద్ర | - | వారి కొడుకు |
| 6. రాజమ్మ | - | కిరాణా వ్యాపారం |
| 7. శ్రీనివాసు | - | ఆమె కొడుకు |
| 8. రమ | - | కూతురు |
| 9. డాక్టర్ | | |

(కర్టెను తెరవగానే ఒక వైపు నుంచి ఒక అబ్బాయి, రెండో వేపునుంచి ఒక అమ్మాయి పరుగెత్తుకుని వస్తారు.)

సునీత : అమ్మయ్య ! హు ! అమ్మయ్య !

అమర్ : అమ్మయ్య ! హాయ్ ! అమ్మయ్య ! (ఇద్దరూ ఆయాసపడుతుంటారు) ఏమిటి అలా పరుగెత్తుకుని వచ్చావు ?

సునీత : నువ్వు అలా పరుగెత్తుకుని వచ్చావేమిటి ?

అమర్ : ముందు నువ్వు చెప్పు. మీ అమ్మ కొడతానందా ?

సునీత : ముందు నువ్వు చెప్పు. మీ నాన్నగారు కొట్టేస్తానన్నారా?

అమర్ : ఛా! మా నాన్నగారు ఎప్పుడూ కొట్టేస్తాననరు. కొట్టరు కూడా ఎందుకలా పరుగెత్తుకుని వచ్చావో చెప్పు!

సునీత : మా అమ్మ కూడా అంతే. కొట్టేస్తానని చెప్పదు. కొట్టేస్తుంది అంతే. నువ్వు అందుకే పారిపోయి వచ్చావా?

అమర్ : చెప్పనా? చెప్పనా? (రహస్యంగా) మా అమ్మ నాకు తలంటు పోస్తానని, తలకి నూనె పెడతానని యింత గిన్నెనిండా పోసుకుని వచ్చింది. దాంతో పారిపోయి వచ్చేశాను. మరి నువ్వు చెప్పు.

సునీత : చెప్పనా? చెప్పనా? (రహస్యంగా) మా అమ్మ నా చేత తాగించాలని యింత పెద్ద గ్లాసు నిండా పాలు పట్టుకుని బయలుదేరింది. ఐతే నీకు తలంటు యిష్టం లేదా?

అమర్ : ఛా! ఎవరికి యిష్టం వుంటుంది? పైగా నూనెతోనా? అదంతా ముఖం మీదకి కారి, కళ్ళుమండి, కళ్ళు కనబడక.. నీ కిష్టమా ఏమిటి కొంపదీసి?

సునీత : నాకూ యిష్టంలేదు. నీకు పాలు యిష్టమా? గ్లాసుడు పాలు అసలు చూస్తేనే వికారం. ఇంక తాగాలంటే ఎంత కష్టమో! చిన్నప్పుడు మనకి నోరు లేదు కనుక సీసాలకి సీసాలు పోసేసేవారు పెద్దవాళ్ళు.

అమర్ : ఓస్ ! నోరు లేకపోతే ఎలా తాగుతానేమిటి ? అసలు నాదెంత పెద్దనోరని మా తాతయ్యలు, బామ్మలు, మామయ్యలు, అత్తయ్యలు, బాబాయిలు, పన్నులూ..................

సునీత : ఉండోవోయి బాబూ ! అంతమంది చుట్టాలేమిటి మీకు ?

[ఒక వేపునుంచి యశోదమ్మ, మరోవేపు నుంచి లక్ష్మమ్మ గ్లాసు పుచ్చుకుని వస్తారు]

యశోద : ఇక్కడున్నారా ? ఏమే సునీతా ! పారిపోయి వస్తావా ? అవతల పాలు చల్లారి పోవడం లేదూ ?

సునీత : నా కిష్టం లేదమ్మా ! పాలు నా కిష్టం లేదమ్మా !

యశోద : ఎందుకిష్టం లేదూ ? అంత పంచదార పోసి అయ్యగా, కలుపుకుని వస్తేనూ ?

అమర్ : పంచదార మంచిది కాదు వంటికి జబ్బు చేస్తుందండీ !

యశోద : మంచివాడివే - ఇదోటి చెబితే అసలు తాగదు మా సునీత !

సునీత : మరి - లోపల పెద్ద వెండి డబ్బాలో పాలున్నాయి కదా - అవి కావాలి నాకు.

యశోద : వెండి డాబ్బానా ? అదేమిటి ? మన యింట్లో అటువంటిది ఏమీ లేదే ?

సునీత : అదేనమ్మా - తెల్లగా మెరుస్తూ వుంటుందే - అది

యశోద : ఓ అదా ! అది స్టీలు క్యాను........ ఆ పెద్దవేమో రేకు డబ్బాలు. వెండి ఎక్కడుంది ?

సునీత : అదే అదే.........ఆ క్యానులో పాలు కావాలి.

య : అబ్బే ! అవి నువ్వు తాగకూడదమ్మా - అవి వూళ్ళో అందరికీ పోయడానికి.

అమర్ : ఔను ! మా యింటికి మీ అమ్మ దాన్లోనే పాలు పట్టుకుని వస్తుంది. [సునీత యీలోగా లోపలికి పరుగెడుతుంది.]

!

లక్ష్మమ్మ : ఇప్పుడైనా వస్తావా ? తలకి నూనె పట్టిస్తాను. [పట్టుకోబోతే పారిపోతాడు.]

అమర్ : నేను రాను. నాకు నూనె అంటే అసహ్యం. (సునీత క్యాన్ పట్టుకుని వస్తుంది.)

యశోద : నూనె అంటే అసహ్యమంటే ఎలాగూ ? మీ నాన్నగారు చేసేదే నూనె వ్యాపారం. మీ యిల్లంతా నూనె మయం. మరి అసహ్యమంటే ఎలా కుదురుతుంది ? ఓసినీ యీ డబ్బాలు యిక్కడికి తెచ్చావెందుకు ? పద పద లోపలికి.

సునీత : నాకు వీటిల్లో పాలు కావాలి. ఆ గ్లాసులోవి వద్దు.

అమర్ : నాక్కూడా డబ్బాల్లో నూనె కావాలి. ఈ చిన్న గిన్నెలోది వద్దు.

లక్ష్మమ్మ : ఆ నూనె తాగుతావా ఏమిటి ? ఏదైతేనేం తలకి అంటు కోవడానికి ?

అమర్ : ఏదైతేనేం అన్నప్పుడు నాకు ఆ డబ్బాలో నూనె తీసుకురా.

లక్ష్మమ్మ : ఆ డబ్బాలు నాన్నగారు దుకాణానికి తీసుకుని వెడతారు. అవి మనం సీలు విప్పకూడదు.

అమర్ : నాకు అదే కావాలి. ఈ నూనె కూరలో వేసేసి అది నాకు తీసుకురా.

లక్ష్మమ్మ : అబ్బా ! అన్నింటికీ పేచీలే.

సునీత : ఈ గ్లాసులో పాలు లోపల పోసేయి. యీ డబ్బాలో పాలు నాకు కావాలి.

యశోద : వద్దమ్మా. ఆ పాలు నీకోసం కాదు.

అమర్ : అవును. ఆ పాలు మాకు పొయ్యడానికి. రోజూ దాన్లోనే తెస్తుంది మీ అమ్మ పాలు. అయితే ఆ పాలు సునీత ఎందుకు తాగకూడదు అని

లక్ష్మమ్మ : (యిబ్బందిగా ముఖం పెట్టి) ఎందుకో అందుకు............

నీకు అవన్నీ దేనికి ? పద నాన్నా ! నెత్తిన చమురు పెట్టి...............

అమర్ : నాకు ఆ లోపల డబ్బాల్లో నూనె అయితేనే కావాలి.

సునీత : ఆ డబ్బాలు నూనె దుకాణంలో పెట్టి మాకు అమ్ముతారు.

యశోద : (ఇబ్బందిగా ముఖం పెట్టి) అవన్నీ నీకెందుకు ? పాలు తాగేద్దువు గానీ - అబ్బ ! ఎంత సేపు నిలబడాలి ? నేను లోపలికి వెడతాను. మీరు రండి. డబ్బాలు లోపలికి తీసుకురా. (క్యానులు అక్కడే వదిలి లోపలికి వెడుతుంది.)

సునీత : ఆ - మా అమ్మ యీ డబ్బాలు మర్చిపోయింది కదా ? ఈ గ్లాసులో పాలు యీ ఖాళీ డబ్బాలో పోసేసి, ఆ డబ్బాలో పాలు నేను తాగేస్తాను. (అని అలాగే చేస్తుంది.)

లక్ష్మమ్మ : వూ - సరే - ఎప్పటికి వస్తావో ఏమో ! ఈ వేళ సెలవు రోజు కదా అని నీకు తల శుభ్రంగా రుద్దేద్దామనుకొన్నాను. నేను పోతున్నాను బాబూ! సునీతా ! ఆ డబ్బాలో పాలు తాగుతున్నావా ? తాగు, తాగు (అంటూ లోపలకు వెడుతుంది)

అమర్ : మనకి రోజూ పోసేవేగా ? (సునీత, అమర్ డబ్బాలు తీసుకుని లోపలకు వెడతారు.)

[మూటలు మోసుకుంటూ రాజమ్మా, శ్రీనివాస్, రమ వస్తారు.]

రమ : అబ్బ ! యింక నేను మొయ్యలేను (అని కింద పడేస్తుంది)

రాజమ్మ : అయ్యో ! య్యో ! అలా కింద పడేస్తావేమిటే ? చినిగిపోయి అవన్నీ ఒలికి పోతాయి.

రమ : ఒలికిపోతే ఏం ? అవన్నీ రాళ్ళేగా ?

రాజమ్మ : ఉష్ ! అరవకు. ఏమిరా శ్రీనివాసూ ! మూట కింద జారవిడుస్తున్నావా ?

శ్రీనివాస్ : జారవిడిస్తే ఏం ? ఇందులో వున్నది తవుడూ, ఏవో పిచ్చి గింజలేగా ?

రాజమ్మ : ఉష్ ! అరవకు.

రమ : ఈ వేళ దుకాణం మూసే వుంటుందిగా ? నిన్ననే పండుగ అయింది ఈ వేళ సెలవు-యివన్నీ మోసుకుని వెళ్ళకపోతే ఏమి ?

రాజమ్మ : నీకేం తెలుస్తుంది తల్లీ ? దుకాణంలో వ్యాపారం చెయ్యడ మంటే మాటలా ? ఎంత కష్టపడాలి ? మీ అన్నయ్యకి యిన్నేళ్ళు వచ్చినా కొంచెం కూడా సాయం చెయ్యడు.

శ్రీనివాస్ : ఎన్నేళ్ళు వచ్చాయేమిటి ? ఇరవయ్యేగా ?

రమ : అయినా నాలంత కూడా లేవు. దుకాణంలో పనిచెయ్యవు. చదువుకోనూ చదువుకోవు. అమ్మకి నీ వల్లే కష్టం.

శ్రీనివాస్ : దుకాణంలో ఎందుకు పని చెయ్యను ? మరి యీ మూటలన్నీ మోసుకుని వచ్చేది దుకాణం కోసమేగా మొన్న హోటలుకి వెళ్ళి - వాడేసి పారేసిన టీ పొడి యింత డబ్బా నిండా ఎవరు తెచ్చారేమిటి ?

రాజమ్మ : ష్ ! అరవకు. అనుమానం తీరిందా ? మూటలు పట్టుకోండి.

రమ : ఇక నేను పట్టుకోను. మా ఫ్రెండ్స్ సునీత, అమర్ అందరూ చూస్తారు. నీకెప్పుడూ అదే పని మూటలు మొయ్యడం అంటారు.

రాజమ్మ : నా తల్లి కాదూ ? అదుగో, మనిల్లు వచ్చేసిందిగా ? పదమ్మా! వంట చెయ్యాలి. ఆకలేస్తోందన్నావుగా ?

(తిరుమలయ్య, అమర్ వస్తారు)

రాజమ్మ : నమస్కారం బాబుగారూ ! ఈ వేళ దుకాణాలన్నిటికీ సెలవు కదండీ ? ఇంటి దగ్గరే వున్నారా ? ఏమోయి అమర్ ! మీ నాన్నగారితో పాటు నువ్వు వ్యాపారం చేస్తావా ?

తిరుమలయ్య : మీ పిల్లలు నీతోటి కలిసి కష్టపడి పనిచెయ్యడం లేదా రాజమ్మా ? అలాగే మా వాడున్నూ, కానీ వీడికింకా కుదురులేదు. ఎప్పుడూ గోటీలు ఆడనూ, పతంగీలు ఎగరెయ్యనూ ! అమ్మ ఏదో తెమ్మని చెప్పిందిగా, తెచ్చావా ?

అమర్ : కూరల్లోకి కారం, టీ చేసుకోవడానికి పొడి, అన్నానికి బియ్యం తెమ్మంది.

తిరుమలయ్య : యిదుగో రాజమ్మ యిక్కడే వుందిగా ? ఈ వేళ దుకాణానికి సెలవు. ఇంటి దగ్గరే వున్న సరుకులు యిస్తుంది తీసుకెళ్ళు.

రాజమ్మ : అలాగే, యిప్పుడే తాళం తీసి అన్నీయిస్తాను. నువ్వెందుకులే బాబూ ! మా శీను తెచ్చి యిస్తాడులే ! ఏరా శీనూ! బాబుగారింట్లో బియ్యం టీపొడి, కారంపొడి అన్నీ యిచ్చి వద్దువుగాని, కాంటా తగిలించు. తూకం చేసి యిద్దాం. పద తల్లీ తొందరగా. ఆకలవుతోందన్నావుగా ? అన్నం వండుతా. [శ్రీనివాస్ లోపలకు వెడతాడు] అయితే బాబూ ! మన అమర్ బాబూ ఏం చదువుతున్నాడు ?

శ్రీనివాస్ : (వసూ) ఆ పెద్ద సంచిలోవేనా బియ్యం ?

రమ : ఆ బియ్యంలో యింకా యివి కలపనిదే ? అవి అమ్మేస్తావా అమ్మా అప్పుడే ?

అమర్ : ఏవి కలపాలి ? ఈ మూటలోనివి ఏమిటి ?

రాజమ్మ : (కంగారుగా) ఏవో ఒకటి ! శీనూ, నీకవన్నీ ఎందుకు ? నేను వస్తానుండు బియ్యం తూకానికి [శీనుమళ్ళీ లోపలికి వెడతాడు] అయితే బాబూ ! మన అమర్ బాబు ఏం చదువుతున్నాడు ?

శీనివాస్ : అమ్మా ! ఆ చిన్నబుట్టలోదేనా చాపత్తా ?

రమ : అప్పుడే ఎలా తూస్తావు ? ఇది అందులో కలపనిదే ?

అమర్ : ఏం కలపాలి ? ఆ మూటలో ఏమిటి ?

రాజమ్మ : (కంగారుగా) ఏదో ఒకటి! - నేను వచ్చి తూస్తానుండు

చాపత్తా నీకెందుకు [శీను లోపలికి వెళ్ళి పోతాడు] అయితే బాబూ! మన అమర్‌బాబు ఏం చదువుతున్నాడు?

శ్రీనివాస్ : (మళ్ళీ వచ్చి) అమ్మా - కారం ప్యాకెట్లు పెద్ద గూట్లో వున్నవేనా ?

రమ : అప్పుడే ఎలా అమ్ముతావు? ఈ ప్యాకెట్లు అమ్మాలి. ఆ గూట్లోవి మన యింట్లో కోసం! వాటిల్లో - అది కలపనిదే ?

అమర్ : వేటిల్లో ఏది కలపాలి ?

రాజమ్మ : ష్ ! ఏమీ లేదు బాబూ! నేను అన్నీ తూకంచేసి తీసుకువస్తాను. ఈ పిల్లలదంతా అయోమయం!

రామలయ్య : రాజమ్మ ! అడిగావుగా? వుండు చెబుతాను. మా అమర్‌బాబు ఆరోక్లాసు చదువుతున్నాడు. త్వరగా వెళ్ళి - ఆ సౌదలన్నీ తూకం చేసి యీ సంచిల్లో పోసి యివ్వు. నేనైనా పట్టుకెళ్ళి యింట్లో పడేస్తాను.

రాజమ్మ : అన్నట్లు మర్చిపోయాను. మా దుకాణంలో నూనె పూరాగా అయిపోయింది. ఒక డబ్బా పంపించండి శీనయ్యతో. దుకాణానికి తీసుకుపోతా.

అమర్ : నాన్నా! ఆ వెనకాల వున్నదిగా చిన్న డబ్బా. ఆ డబ్బా యిచ్చేయనా?

రామలయ్య : ఆ, ఆ! ఆ డబ్బా.........అందులో నూనె మన యింట్లో కోసం. పెద్దడబ్బాలు నీలం రంగువి వున్నాయే! అవి మనం దుకాణాలకి వెయ్యాలి.

అమర్ : పద నాన్నా! సౌదాలు తెచ్చి అమ్మకిద్దాం.

రాజమ్మ : అలాగే! అన్నీ పంపిస్తాను.

[లైట్లు ఆరి వెలుగుతాయి]
(లక్ష్మమ్మ, అమర్ ప్రవేశం)

లక్ష్మమ్మ : అయ్యో! అయ్యో! మా అమర్‌కి ఏమైందో ఏమో రాత్రి

నుంచి ఒకటే వాంతులు. వాంతులతో నీరస పడిపోయాడు. ఎందుకు వచ్చాయో ఏమిటో.

అమర్ : అమ్మా! అమ్మా! కళ్ళు తిరుగుతున్నాయి. ఒకటే కళ్ళు తిరిగిపోతున్నాయి. నాకు వద్దంటే తలంటి పోశారు. అందుకే అయ్యుంటుంది.

లక్ష్మమ్మ : తలంటు పోస్తే కళ్ళు తిరుగుతాయా ? నేను పుట్టినప్ప టినుండి పోసుకున్నాను. నాకు కళ్ళు తిరిగాయా ?

అమర్ : ఏమో! నాకు మాత్రం - నీరసం - వాంతులు - కళ్ళు తిరగడం - కళ్ళు తిరగడం - వాంతులు - వాంతులు.

[యశోదమ్మ, సునీత కలసి వస్తారు]

యశోద : ఏమండీ! మా సునీతకి రాత్రినుంచీ చేతులు మీద ఏవో దద్దుర్లు వచ్చాయండీ! ఒకటే బాధ పడిపోతోంది. మీరు యిక్కడ నిలబడ్డారేమిటి? మీ అమర్‌కి ఏమైంది? రాత్రి మీ యింట్లో ఏదో గొడవ వినబడిందే.

సునీత : అమ్మా! మంట! చేతుల మీద మంట!!

యశో : అవునేవ్! నువ్వు అంటుంటే నాకూ అలాగే వుంది !

సునీ : అమ్మా! నాకు పాలు తాగినందువల్లే యిలా అయిందమ్మా.

యశో : ఛా! పాలు తాగితే వంటికి దద్దుర్లు రావడమేమిటి? నేను చిన్నప్పటి నుంచీ పాలలో మునిగి తేలడం లేదూ!

సునీ : ఛీ! పాలంతా జిడ్డు! దాన్లో ఎవరన్నా మునుగుతారా? (మూలిగి) అమ్మా! నాకు యిక్కడ మంట-యిక్కడ దురద-చేతులంతా నొప్పి.

యశో : అవునేవ్! నాకు-నాకూ యీ చెవి వెనకాల ఏమిటోగా వుంది. కాళ్ళు ఒకటే లాగేస్తున్నాయి.

(తిరుమలయ్య వస్తాడు)

తిరు : (మూలుగుతూ) నాయనా అమర్! నీకెలా వుంది ?

అమర్ : (మూలుగుతూ) నాన్నా చాలా నీరసంగా వుంది.

లక్ష్మమ్మ : మీరేమిటి అలా మూలుగుతున్నారు? అదేమిటి ఆ దవడ అలా వాచిపోయింది.

తిరు : గబగబ అన్నం తింటోంటే-ఏంటి కింద యింత రాయి వచ్చింది! పోనీ టీ తాగుదామంటే-అంటా నీళ్ళ టీయే-ఎంతో నీళ్ళగా పలుచగా వుంది, అందుకనీ- అందుకనీ-(మూలిగి) అదే వదిలేశాను...అబ్బా! ఏంటి నొప్పి

అమర్ : నాన్నా! మనమంతా కలిసి డాక్టరు దగ్గరకి వెడదామా.?

లక్ష్మమ్మ : అవునండీ! నాక్కూడా పొద్దున్న టీ తాగిన దగ్గర్నుంటీ ఏదో లాగ వుంది. ఎంతో పలుచగా వుంది టీ! పదండైతే.

(శ్రీనివాస్, రాజమ్మ, రమ వస్తారు.)

రాజమ్మ : ఏమిటియి మీరంతా యిక్కడ నిలబడ్డారు?

లక్ష్మమ్మ : మేము డాక్టరు దగ్గరికి వెళ్ళాలి.

రాజు : మేమూ డాక్టరు దగ్గరికే బయలుదేరాము. రమకి పొద్దుటి నుంచీ కడుపులో ఒకటే నొప్పి, మెలికలు తిరగి పోతుంది. శొంఠి రసం పోశాను. అదీ పని చేయలేదు. పాలు తాగిస్తే పాపం ఆకలి తీరలేదు.

శ్రీని : అమ్మా పద! (మూలుగుతూ) నాకు కాళ్ళు పీకేస్తున్నాయి. ఆకలి! కళ్ళుమంట! చెవిలో ఏదో చప్పుడు! పదమ్మా!

రమ : అమ్మా-నాకు కడుపులో నొప్పి! తగ్గడంలేదు. బాబోయి! మంచి మందు కావాలమ్మా! రంగాచార్యులు డాక్టరు గారి దగ్గరకి వెడదాం.

[అందరూ–పదండి, పదండి డాక్టరు దగ్గరకి....]

[లైట్లు ఆరుతాయి. పిల్లలు వెళ్ళి మళ్ళీ తిరిగి యీవేపునుంచి ప్రవేశిస్తారు.]

[డాక్టరుగారూ! డాక్టరుగారూ!]

డాక్టరు : ఆ.....ఆ...ఏమిటి? బస్తీ మొత్తం వచ్చినట్లున్నారే! మీరంతా యీ వెనకాల యిళ్ళల్లో వుంటారు కదా? ఒక్కొక్కరు

వస్తే మంచిది. కొంచెం వెనుకగా నిలబడతారా?

లక్ష్మమ్మ : మా అబ్బాయికి రాత్రినుంచి వాంతులు. పాపం పచ్చి మంచి నీళ్ళు కూడా తాగడం లేదు.

అమర్ : (మూలుగుతూ) పండు మంచి నీళ్ళుకూడా తాగలేదు.

తిరు : నాకేమో పంటినొప్పి.

డాక్టర్ : ఉండండి. ఈ అబ్బాయి సంగతి చూద్దాం. అబ్బాయీ! నిన్న రాత్రి ఏం తిన్నావు ? ఏం తాగవు ?

అమర్ : మా అమ్మ నిన్న తలంటుపోసిందండీ! ప్పట్నుంచీ నాకు ఒకటే వాంతులు. వద్దంటే వినదండీ! అసలు పిల్లలకిక తలంటు ఎందుకండీ?

డాక్టరు : వుండు మరి. తలంటు నెత్తిమీద నీళ్ళు పోసుకోవడం కానీ లోపలికి-అంటే పొట్టలోకి ఏం తాగావు అవి!

అమర్ : నేనాండి? నేను-పాలు తాగాను-పెరుగుతిన్నాను. యింకా పాయసం తాగాను. ఆ....ఆ....అన్నం తిన్నాను.

తిరు : నేను అన్నం తిన్నానండీ! అప్పట్నుంచీ యీ పంటినొప్పి.

డా : ఐసీ! మీకు అన్నం తింటే పంటి నొప్పి! ఈ అబ్బాయికి పాలు తాగితే వాంతులు.

లక్ష్మమ్మ : నాకూ అలాగే వుందండీ! నీళ్ళ టీ తాగినప్పటి నుంచీ నా పనీ అలాగే వుంది.

యశోద : డాక్టరు గారూ! మా పిల్లని చూడండి.

సునీత : అవునండీ! నాకు చేతుల మీద దురద-మెడ మీదేమో మంట ఇక్కడ కాలి మీద వాచింది. మోచేతి తగ్గర దద్దుర్లు.

డాక్టరు: అలాగా ? నిన్నట్నుంచీ ఏం తిన్నావమ్మా?

సునీత : నేనాండి? మంచిగా నూనెపోసి, మా అమ్మ గారెలు వండింది. ? అవి తిన్నాను. యింకానేమో-మరింకానేమో బాగా నూనె

వేసి పులిహోర చేసింది. అది తిన్నాను. పులిహోరలో రాళ్ళున్నా గానీ తినేశానండీ!

డాక్టరు : అమ్మా! మీరేం తిన్నారు ?

యశోద : నేను బాగా యింతకారం పోసి, కూరగాయలు వేయించుకుని తిన్నానండీ! అన్నంలో రాళ్ళున్నా-నాకు నమిలే అలవాటు లేదు కదా! అందుకని మింగేశాను.

డాక్టరు : మీరేం చేస్తుంటారు ?

యశోద : మేము పాల వ్యాపారం చేస్తాము. వీళ్ళందరికీ మేమే పోస్తాం పాలు.

డాక్టరు : బాబూ! నువ్వెందుకు వచ్చావు?

శ్రీని : నాకు......నాకు ఒకటే నీరసం-కాళ్ళు లాక్కుపోతున్నాయి చెవుల్లో ఏదో చప్పుడు.

రమ : నాకు కడుపు నొప్పి.......విపరీతంగా కడుపు నొప్పి, పోట్లు!

రాజమ్మ : నాకూ అలాగే వుందండీ డాక్టరుగారూ!

డాక్టరు : ఉండమ్మా! అందరి కేసులూ విన్నమీదట, మీ అందర్నీ ప్రశ్నలు వేయాలనిపిస్తోంది. మరి జవాబులు చెబుతారా?

అందరూ : ఊఁ చెబుతాం.........(మూలుగుతారు)

డాక్టరు : మీ అందరూ పాలు ఎక్కడ కొంటారు ?

(యశోదమ్మ కుటుంబం తప్ప మిగిలినవారు) : ఆమె దగ్గర

రాజమ్మ : ఆవిడ మా యింటింటికీ పాలు పోస్తుంది. ఆ పాలతో కలిపిన టీ ఎంత పలుచనో! రోజూ చెబుతూనే వుంటాను. మరీ అన్ని నీళ్ళు కలపకు-కాసిని పాలు కూడా కలుపు అని.

లక్ష్మమ్మ : అయ్యో! పాలున్నాయి చూడు గిన్నెలో అంటే-మావాడు ఆ తెల్ల నీళ్ళేనా అంటాడు. పెరుగు కావాలని తోడు

పెడితే అది మజ్జిగయి కూచుంటుంది.

అమర్ : అవును. గిన్నెలో పడుకుంటుంది మజ్జిగలాగా.

తిరు : మా బస్తీ మొత్తానికి ఆవిడగారు పోసేపాలే గతి. ఆ మధ్య బర్రెలు లేవు. కానీ పాల సరఫరా మాత్రం ఆపలేదు. అదేం వింతో!

శ్రీని : నల్ల బర్రెలు లేకపోయినా, నల్లాలు వున్నాయిగా!

అమర్ : నల్లాలు లేకపోయినా బావి వుందిగా ?

రమ : బావి లేకపోయినా, హౌజులో నీళ్ళుంటాయిగా.

డాక్టరు : చాలు! చాలు. అమ్మా! మీరు పాలు పోస్తున్నారు. అందులో నీళ్ళు ఎన్ని కలుపుతున్నారు? కొలత సుమారుగా చెప్పగలరా?

సునీత : సగం నీళ్ళు! సగం పాలు!

యశోద : (కొట్టినంత పని చేసి) మువ్వ్యారుకో! నోర్మూసుకో నీళ్ళా? నీళ్ళు! కలపనండ్, అబ్బే ఒట్టు!

డాక్టరు : పాలు తాగి, ఆ పెరుగు తిని, ఆ పాయసం తాగిన వారందరికీ జబ్బులు చేశాయి. సరే-మీరందరూ నూనె ఎక్కడ కొంటారు?

(లక్ష్మమ్మ కుటుంబం మినహా మిగతా వారందరూ) : యిదిగో ఈ తిరుమలయ్య గారి దగ్గరే.

డాక్టరు : మీరు నూనె డబ్బాలు ఎక్కడ తెస్తారు? తెచ్చినవి తెచ్చినట్లే అమ్మేస్తారా?

తిరు : ఓ! తెచ్చినవి తెచ్చినట్లే అమ్మేస్తాను.

అమర్ : లేదు. ఒక డబ్బా సీలు విప్పేసి, ఏదో పోసేసి, మళ్ళీ సీలు వేసేసి, పంపేస్తాం. ఇంకో డబ్బా సీలు విప్పి అందులో ఏదో తెల్లగా పోసేసి, పంపేస్తాం.......... మళ్ళీ యింకో డబ్బా విప్పి...............

లక్ష్మమ్మ : (కొట్టినంత పని చేసి) నోర్మూయి! నువ్వూరుకో! ఏమీ కలపమండీ! స్వచ్ఛమైన, కమ్మని వాసనగల మంచి జిడ్డుగల నూనె-అలా అమ్మేస్తాం.

తిరు : ఔను, మా నూనె ఎంత బాగుంటుందో! కావాలంటే మీకు సాంపిల్ పంపిస్తాను డాక్టరుగారూ!

అమర్ : నాన్నా! చిన్న డబ్బాలోదా? పెద్ద నీలం డబ్బాలోదా? ఏది తీసుకురావాలి డాక్టరు గారి కోసం!

తిరు : (ఉరిమిచూసి) నిన్నూరుకోమన్నానా ?

డాక్టరు : సరే! సరే మీరందరూ బియ్యం, టీ పొడి, కారం ఎక్కడ కొంటారూ

(రాజమ్మ కుటుంబం తప్ప మిగిలిన వారందరూ అదుగో ఆ రాజమ్మగారి దుకాణంలో.)

డాక్టరు : బియ్యం స్వచ్ఛంగా తుక్కూ దూగరా లేకుండా బావుంటాయూ?

రాజమ్మ : చాలా బావుంటాయి. చిట్టి ముత్యాల్లాగా ముద్దొస్తూ ఎంతో బాగుంటాయి.

శీను : అదే సైజులో రాళ్ళు వస్తాయిగా-అందుకు అవీ ఇవీ ఒక్కటే సైజు.

రాజమ్మ : నువ్వూరుకోరా వెర్రిశీనయ్యా! డాక్టరుగారు అడిగేది. బియ్యం గురించి.

శీను : అవును నేను చెప్పేది రాళ్ళగురించి.

రాజమ్మ : నిన్ను నోరు మూసుకోమన్నానా?

డాక్టరు : టీ పొడి ఏం బ్రాండు అమ్ముతారు.

శీను : రాజమ్మా బ్రాండు. అదికూడా-హోటల్లో పారేస్తారే. ఆ తుక్కు సగమూ, వేరే సగమూ!

రాజమ్మ : అంతా ఉత్తిదే. నిన్ను వూరుకోమని చెప్పానా?

రమ : టీ పొడి అయితే సగం కానీ - కారం మాత్రం మూడు వంతులు తవుడు,ఒకవంతు కారం.

రాజమ్మ : ఓసినీ! ఎలా చెబుతోందో! నా మీదే చెప్పే పాటి దానివైనావా?

డాక్టరు : పోనీలే అమ్మా ! కోప్పడకు చిన్నపిల్లలు. వాళ్ళకి తెలిసింది వాళ్లు చెప్పారు. మీరు ఏమీఅనుకోనంటే ఒక్క మాట చెప్పి ఆ తర్వాత మందులిస్తాను. ఆవిడగారు పోస్తున్న కల్తీపాలు, నీళ్ళపాలు తాగి మీరందరూ జబ్బుపడ్డారు. ఉండండి నన్ను చెప్పనివ్వండి [అందరూ తెల్లబోయి చూస్తుంటారు] అలాగే తిరుమలయ్యగారు అమ్ముతున్న కల్తీనూనె వాడి మీరంతా జబ్బు పడ్డారు.

అదే విధంగా రాళ్ళబియ్యం వల్ల, కల్తీ టీ పొడి వల్ల రకరకాల బాధలు వచ్చాయి.

మరి ఎవరికి వారు లాభం చూసుకొంటే నష్టపోయేది ఎవరు? ఎవరు? చెప్పండి (అందరూ తలవంచుకుంటారు)

అందరూ : మేమే!

డాక్టరు : పాల వ్యాపారి కల్తీ పాలు అమ్ముతుండవచ్చు. లాభం సంపాదించవచ్చు. కానీ తాను కొన్న నూనె వల్ల, బియ్యంవల్ల, అతను అతని కుటుంబం దెబ్బ తిని పోతారు. ఔనా! (అందరూ తలలూపుతారు.)

మరి నూనె దుకాణం వారుతాము కల్తీనూనె అమ్మి ప్రజల ఆరోగ్యం చెడగొట్టవచ్చును. కానీ, తాను యితరుల దగ్గర కొన్న సరుకుల వల్ల విపరీతంగా నష్టపోతాడు.

అదే విధంగా సరుకులు అమ్మే ప్రతివారూ తాము వ్యాపారం చేయగలరు గానీ యితరుల నుండి తమ ఆరోగ్యం కాపాడుకోలేరు. ఏమంటారు?

యశోద : మీరు చెప్పింది నిజం!

రాజమ్మ : మీరు చెప్పింది ముమ్మాటికీ నిజం!

రమ : మీరు చెప్పింది అక్షరాలా నిజం!

అమర్ : అంటే మనం యిప్పుడు నూనెతో తలంటు పోసుకోవడం మానేయాలా?

సునీత : అంటే మనం యిప్పుడు పాలు తాగడం మానెయ్యాలా ?

డాక్టరు : ఏమీ కాదు. కల్తీ వ్యాపారం చెయ్యడం మీ పెద్దలు మానెయ్యాలి. ప్రతివారూ యితరుల ఆరోగ్యం గురించి ఆలోచించాలి. సంఘం గురించి ఆలోచించాలి. తాముా నేరం చేసి మోసం చేస్తే తప్పించుకోవచ్చును. కానీ యితరుల మోసం నుంచి తప్పించుకోలేరు కదా ? చెప్పండి, జానా ?

అమర్ : కేకలేయండి డాక్టరుగారూ! నాకు ఏడుపొస్తుంది.

సునీత : అలా గట్టిగా మాట్లాడకండి నాకు భయం వేస్తుంది.

డాక్టర్ : మీకెందుకమ్మా భయం! మీరు పెద్దవాళ్ళయినాక మీరు యిటువంటి పనులు చేయవద్దు. తప్పుచేయని వాళ్ళకి భయం వుండదు. సరేనా!

యశోద : తెలిసిందండీ! రేపు నేను మంచి బర్రెలు నాలిగింటిని కొని బస్తీ మొత్తానికి చిక్కని పాలు పోస్తాను.

తిరు : నేనూ అంతే - ఆ కల్తీ డబ్బాలు తిప్పి పంపేస్తాను.

రాజమ్మ : నేనూ అంతే.

డాక్టరు : మీ అందరికీ కనువిప్పు అయింది. అదే నాకు ఎంతో సంతోషం.

రమ : మరి మాకు మందులో?

అందరు : యిస్తారు, యిస్తారు లోపలికి పదండి.